శ్రీనివాస విలాస గ్రంథావళి-6

# ఆంధ్ర లక్షణ రత్నాకరము

(వ్యాకరణగ్రంథము)

శిరోమణి, చెలమచెర్ల రంగాచార్యులు

1977

శ్రీ నివాస పబ్లికేషన్స్

శ్రీనివాస విలాసము, 1-9-625/8,

విద్యానగరము-హైదరాబాదు-500 044.

వెల : రు. 5.00

శ్రీనివాస విలాస గ్రంథావళి-6

# ఆంధ్ర లక్షణ రత్నాకరము

(వ్యాకరణ గ్రంథము)

శిరోమణి, చెలమచెర్ల రంగాచార్యులు

1977

శ్రీనివాస పబ్లికేషన్స్

శ్రీనివాస విలాసము, 1-9-625/8,

విద్యానగరము-హైదరాబాదు-500 044.

# పీఠిక

స్వాతంత్ర్య సిద్ధివలనఁ బరభాషల ప్రాభవము వోయి మాతృభాషల ప్రాముఖ్యము హెచ్చినది. విద్యార్థులు సర్వ విషయములను దమ మాతృభాషలోనే నేర్చుచున్నారు. తాము నేర్చిన విషయములను నిర్దుష్టముగాను, సూటిగాను వ్యక్తీకరింపవలెనన్న విద్యార్థులు మాతృభాషలోఁ జక్కని ప్రావీణ్యము గడింపవలసియున్నారు. పదస్వరూపము బాగుగాఁ దెలిసినఁ గాని ప్రయోగము సుకరముగాదు. కావుననే విద్యావేత్తలు పాఠ్య ప్రణాళికలో శబ్దలక్షణమునకు సముచిత స్థానమిచ్చినారు. లక్షణజ్ఞానము విద్యార్థుల రచనా నైపుణ్యమును బెంపొందించు ననుట వాస్తవము,

ఈ యాంధ్ర లక్షణ రత్నాకరమునఁ బాఠ్య ప్రణాళిక ననుసరించి సోపాన క్రమమున 'అక్షర స్వరూపము' (*Orthography*) 'పదలక్షణము' (*Etymology*) 'వాక్య పరిచ్ఛేదము' (*Syntax*) అనునవి యథాపేక్షితముగ నిరూపింపఁ బడినవి. అక్షర ప్రకరణమున సాధారణాక్షరములను దెలిపి తెలుఁగుభాషకు విలక్షణములైనట్టి లఘ్వలఘువులును, ఖండబిందువును, రేఫ అకారములును వివరింపఁ బడినవి. విద్యార్థులకుఁ దఱచుగా భ్రామకములగు శ ష స లు, థ ధ లు, య వ మున్నగు వర్ణముల విషయమున సోదాహరణముగా జ్ఞాపిక పట్టిక లీయఁ బడినవి. అట్లే పదలక్షణమున విశేష్యాదులు, క్రియలు, కృత్తద్ధితములు, వివిధ పదముల ప్రక్రియ చూపఁబడినది. ఆరీతిగనే వాక్య స్వరూపమున వాక్యము లేర్పడు పద్ధతిఁ దెలిపి జాతీయములు, నానుడులు, ధ్వన్యనుకరణాదులును గొన్ని దిక్ప్రదర్శనముగాఁ జూపఁబడినవి. సమాసములకును, సంధులకును, అలంకారములకును, ఛందస్సులోఁగొన్ని వృత్తాదులకును లక్ష్య లక్షణములు ప్రదర్శింపఁ బడినవి.

ఇందలి విషయములను బరిశీలన దృష్టితోఁ జదివిన విద్యార్థులు మాతృభాషలో సముచితమైన ప్రవేశము నందఁగలరు. దీని నాధార

భూమికగాఁగొని సోదర బోధకవర్గము విద్యార్థిబృందమును భాషావాహి న్యవగాహనమునఁ గృతార్థముఁ గావింపఁ గలుగునని విశ్వసించు చున్నాను.

## ఉపజీవ్య గ్రంథములు

౧. అప్పకవీయము ౨. ఆంధ్ర శబ్ద చింతామణి ౩. ఆంధ్ర భాషాను శాసనము ౪. బాల వ్యాకరణము ౫. బాల వ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక ౬. శబ్దరత్నాకరము ౭. *Modern Essays and Letters*

ఈ గ్రంథముల రచయితృ మహోదయుల కెల్లరికిఁ గృతజ్ఞతా పూర్వక నమోవాకములు.

చెలమచెర్ల రంగాచార్యులు,
(గ్రంథకర్త)

# మనవి

ఇది ఉన్నత పాఠశాలలో పనిచేయుచున్న బోధక వర్గము వారి నిమిత్తమై తగు విషయ విభాగమును సోపాన క్రమమున పాఠ్య ప్రణాళికను గల్గి యథాపేక్షితముగ నిరూపణములతో 1957 లో రచయింపబడినది.

ఇది పలువురు పండితుల మన్నన లందిన గ్రంథము. సహృదయ హృదయామోదము నందిన గ్రంథము.

ఇదివఱకే ఇది రెండు ముద్రణములందియున్నను ప్రకృతము సర్వవిషయములను మాతృభాషలో పి. జి. స్థాయి వఱకును కొనసాగించుటకు విశ్వవిద్యాలయము అంగీకరించుటతోను, రాష్ట్ర అధికారభాష తెలుగే అయినందువలనను దీని అవసరము విద్యార్థులకును, ఉపాధ్యాయులకును, భాషాంతరీకరణ కర్తలకును కలదని గుర్తెఱిగి, ఈ గ్రంథ తృతీయ ముద్రణమునకు కడంగితిమి. కాకతాళీయముగా కాకతీయ విశ్వవిద్యాలయమువారు మా ఈ గ్రంథమును ప్రాచ్యభాషాపరీక్షలకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించుట జరిగినది, దానితో ఈ తృతీయ ముద్రణము ఎంతటి ఆవశ్యకమో తెల్లమైనది. ఈ విధముగా శ్రీనివాస విలాస ప్రచురణల షష్ఠమ కుసుమమగు మా ఈ "ఆంధ్ర లక్షణ రత్నాకరము" ను పాఠకలోకమున కందించుచున్నాము.

పింగళాశ్వయుజ పూర్ణిమ
అక్టోబరు 1977

ఎ. గోపాలకృష్ణమాచార్యులు,
ప్రొప్రైటర్, శ్రీనివాస పబ్లికేషన్స్

# కృతజ్ఞతలు

మా కత్యంత ఆప్తులును ఈ గ్రంధము కాకతీయ విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడుటకు కారణభూతులు నగు మహామహులకును కోరినంతనే తమకెన్ని పనులున్నను ప్రక్కకుబెట్టి మా ఈ గ్రంథము నచ్చొత్తించి ఇచ్చిన మాధవీ ఆర్ట్ ప్రింటర్స్ వారికిని మా హృదయ పూర్వక కృతజ్ఞతాంజలులు

ఎ. గోపాలకృష్ణమాచార్యులు
ప్రచరణకర్త

# వి ష య సూ చి క



# ఆంధ్ర లక్షణ రత్నాకరము

## ౧. అక్షర ప్రకరణము

౧. అక్షరమూలము భాష.

భావ వాహకము భాష. ఒకరి యభిప్రాయము నొక్కరు తెలిసికొనుటకు ముఖ్యసాధనము భాష. వాక్యముల సమూహమే భాష. అర్థవంతములైన పదముల చేరికవల్లన వాక్యము లేర్పడును. ఆ పదము లక్షర నిర్మితములు. కావున మూల మక్షరము లని తేలినది. అక్షరములనే వర్ణములనియు వ్యవహరింతురు.

౨. ఆంధ్రభాష.

భరతఖండములో వివిధ ప్రాంతములు గలవు. ఒక్కొక్క ప్రాంతములో నివసించు జను లొక్కొక భాషను మాటలాడుదురు. వంగదేశములో వంగభాష. మహారాష్ట్ర దేశమున మహారాష్ట్ర భాష. అట్లే ఆంధ్రదేశమున ఆంధ్రభాష. ఆంధ్ర ప్రాంతమునకే తెలుఁగు దేశమని మఱియొక పేరు గలదు. కాఁబట్టి ఆంధ్రభాషయే తెలుఁగుభాష.

౩. ఆంధ్రభాషలోని యక్షరము లేఁబదియాఱు. (౫౬)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం ః

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ

ద ధ న ప ఫ బ భ మ య ర ఱ ల ళ వ శ ష స హ

ఈ యేబదియాఱు వర్ణములు మొదటినుండియు నాంధ్రభాషలో నున్నవని తలఁపరాదు సంస్కృత ప్రాకృత భాషాపదములు తెలుఁగులోఁ గలియఁజొచ్చిన నాఁటినుండియే యిన్నివర్ణములేర్పడినవి

౪. తొలుత తెలుఁగునకు వర్ణములు ముప్పదియాఱే. (౩౬)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం

క గ చ ౘ జ ౙ ట డ ణ త ద న ప బ మ య ర

ల ళ వ స హ

(కొన్ని పదములలో రేఫను ఱ గా వ్రాసి యూది యుచ్చరింతురు. ఱ అను నక్షరమును వేరుగాఁ జూపి ముప్పది యేడు వర్ణములని కొంద ఱందురు.)

౫. మొదట తెలుఁగులో లేక, సంస్కృత సంబంధము వలనఁ బిమ్మట వచ్చిచేరిన యక్షరములు పందొమ్మిది. (౧౯)

ఋ ౠ ఌ ౡ ః

ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ థ ధ ఫ భ శ ష.

౬. సంస్కృత భాషలోని వర్ణములు ఏఁబది. (౫౦)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ ం ః

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న

ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.

౭. ప్రాకృత భాషయందలి యక్షరములు నలుబది (౪౦)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ ం ః

క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ

బ భ మ య ర ల వ స హ ళ.

౮. 'క్ష' అనునది ప్రత్యేకాక్షరము కాదు.

ఇది 'క-ష' అనువాని కలయిక వలన నేర్పడినది. కావున తక్కిన సంయుక్తవర్ణములగు 'క్త' మొదలైన వానిలో నిదియు నొకటియే. వర్ణమాలలో వేఱుగా దీనికి లెక్కలేదు.

౯. ళ-ఇది ప్రత్యేకాక్షరము.

ఊది పలుకుట వలన నేర్పడిన యలము లకారము కాదు.
(ఇది వేఱు వర్ణము కాదనియు లకార రూపాంతరమే యనియు కొంద అందురు )

౧౦. అక్షరమును వ్యవహరించునపుడు కారము' అని చేర్చి పలుకవలెను.

ఉదా అకారము కకారము మొ॥

ర అనుదానిని రేఫమనవలెను ళ అనుదానిని ళవర్ణ మనుటలెస్స

౧౧. అక్షరములు రెండు విధములు అచ్చులు-హల్లులు.

## అచ్చులు

(అ) అ కారమునుండి ఔ కారము వఱకును గల యక్షరము లను అచ్చు లందురు. అచ్చులకే స్వరము లనియు, ప్రాణము లనియుఁ బేరు.

అచ్చులు స్వతంత్రములు సొంతముగాను హల్లుల మీఁదను బలుకఁబడును హల్లుల యుచ్చారణమునకివి ప్రాణమువంటివి కావున వీనికి ప్రాణములని పేరు సార్థకము.

(ఆ) అచ్చులు రెండువిధములు హ్రస్వములు-దీర్ఘములు.

అ, ఇ ఉ ఋ ఌ ఎ - ఇవి హ్రస్వములు

హ్రస్వములనఁగా పొట్టివి. వీనికి లఘువు లనియు పేరు.

ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ - ఇవి దీర్ఘములు

దీర్ఘములనగా పొడుగచ్చులు. వీనికి గురువులనియు పేరు.

(ఇ) ఏ ఓ' లు వక్రములు, 'ఐ ఔ' లు వక్రతమములు అని వ్యవహరింపబడును.

(ఈ) ఁ దీనిని అరసున్న యందురు. అర్ధానుస్వారము-అర్ధ బిందువు - ఖండబిందువు ననియు దీనికి వ్యవహారము కలదు.

(ఉ) ం ఇది నిండుసున్న. ఇది పూర్ణానుస్వారము-పూర్ణబిందువు నను పేళ్లతోఁ బిలువఁబడును.

(ఊ) ః ఇది విసర్గము. రెండు సున్నలు.

ఈ యర్ధానుస్వార పూర్ణానుస్వార విసర్గము లెప్పుడును స్వర ముల మీదనే యుండును వీనికి స్వతంత్ర ప్రయోగము సంభవింపదు. అందువలననే యుభయధర్మములు గల వీని నుభయము లందురు

## హల్లులు

(అ) క కారము మొదలు హ కారమువఱకునుగల ముప్పదియే డక్షరములు హల్లు లనఁబడును.

అచ్చులవలె హల్లులు స్వతంత్రములు గావు క గ మొదలైన హల్లులలో క్ గ్ మొదలైనవే హల్లులు వానిపైఁ గనఁబడు తలకట్టు అకారమునకు ప్రతినిధి ఉచ్చారణ సౌకర్యము కొఱకు అచ్చులతోఁ జేర్చి హల్లులను బల్కుదురు అ ఇ ఉ ఋ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అనునవి హల్లులమీదఁ జేరునపుడీచిహ్నములుగాఁ గనఁబడును

క్+అ = క క్ + ఇ = కి, క్+ఉ =కు క్+ఋ = కృ; క్+ఎ = కె క్+ఏ = కే క్+ఐ = కై. క్+ఒ = కొ క్+ఓ = కో క్+ఔ = కౌ.

హల్లులను ప్రాణిలేనియు, వ్యంజనము లనియునుబిల్తురు.

(అ) హ్రస్వ దీర్ఘ భేదములు హల్లులకు లేవు.

రామా మొదలైన యక్షరముల మీఁది దీర్ఘము రేఫ మకారములకు సంబంధించినది కాదు అది వానిపై నున్న ఆకారమునకు సంబంధించినది యనియే గుర్తింపవలెను

(ఇ) కేవలము హల్లును వ్రాయునపుడు క్ న్ ల్ అను రీతిని వ్రాయవలెను. ఇట్టి వానిని పొల్లు లందురు.

ఉదా - కలువల్ - విచ్చెన్ మొ

(ఈ) పొల్లు హల్లుపైన అనుస్వార విసర్గములు రావు.

(ఉ) హల్లు మీఁద ఒకటిగాని, రెండుగాని హల్లులు చేరవచ్చును. సరూపహల్లు చేరిన ద్విత్వ మందురు.

ఉదా - క్+క్+అ=క్క

విరూపహల్లు చేరిన సంయుక్తాక్షర మందురు.

ఉదా - క్+త్+అ=క్త

## ౧౨. అక్షర సంజ్ఞలు

(అ) క కారమునుండి మ కారము వఱకుగల ఇరువదియేడు హల్లులకును స్పర్శము లని పేరు.

(ఆ) ఈ యిరువదియేడు వర్ణములను ఐదు విభాగములుగాఁ జేసినారు. వీనికి వర్గము లనిపేరు.

క మొదలుగాఁగల వర్గము క ఖ గ ఘ ఙ— క వర్గము. ఇట్లే చ - ట - త - ప వర్గముల నెఱుంగునది

(ఇ) క చ చ ట త ప – ఈ వర్ణములు పరుషములు. కఠినో చ్చారణము గలవని యర్థము.

(ఈ) గ జ జ ద డ బ—ఇవి సరళములు. మృదూచ్చారణము గలవి యని భావము.

(ఉ) య ర ల వ—వీనిని అంతస్థ్సము లందురు.

(ఊ) శ ష స హ —ఇవి ఊష్మము లనఁబడును.

(ఋ) పరుషసరళములుగాని హల్లు లన్నియు స్థిరములు.

(ౠ) ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ— వీనికి వర్గయుక్కు-లని పేరు.

(ఌ) ఙ ఞ ణ న మ ౕ ం—ఇవి అనునాసికములు.

(ౡ) న—ఇది ద్రుతము

పదాంతమందలి ని -ను–నకారములు ద్రుతములు.

## ఉత్పత్తి స్థానములనుబట్టి వర్ణముల సంజ్ఞలు

౧౩. ప్రాణవాయువు హృదయమునుండి వెడలి కంఠము మొదలు పెదవుల వఱకును గల ఆయా స్థానములను తాఁకుటవలన వర్ణము లేర్పడును. ఏస్థానమున నేర్పడిన వర్ణము నాస్థానవాచక శబ్దముతోఁ గలిపి పిలుతురు.

ఉదా - అకారమును ఉచ్చరించునపుడు కంఠమున తాఁకుడు గలిగినది కావున అకారమును కంఠ్యమందురు

ఈ క్రింది యక్షర బృందములకు వాని యెదుటనున్నవి సంజ్ఞలు.

అ ఆ క ఖ గ ఘ ఙ హ ః—కంఠ్యములు.

ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ—తాలవ్యములు.

(దవుడల సాయమునఁ బుట్టినవి )

ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ఱ ష శ—మూర్ధన్యములు )

(మూర్ధము నోటిలో పైభాగము అందు బుట్టినవి )

ౡ త థ ద ధ న ల స చ జ—దంత్యములు

(దంతములఁ దాఁకుటవలనఁ గలిగినవి)

ఉ ఊ ప ఫ బ భ మ—ఓష్ఠ్యములు

(ఓష్ఠమనఁగా పెదవి పెదవుల సాయమున నుదయించునవి )

ఙ ఞ ణ న మ ఁ ం — నాసిక్యములు

నాసిక అన ముక్కు ముక్కుతో బల్కునవి )

వీనికి స్వవర్గస్థానములు కూడ కలవు కావున నివి యుభయ స్థానికములు

ఎ ఏ ఐ—కంఠతాలవ్యములు

(అ + ఇ=ఎ అయినది కావున అకారస్థానమైన కంఠము ఇకార స్థానమైన తాలువు నను రెండును ఎకారమునకు స్థానమైనవి ఇట్లే తక్కినవాని విషయమునను గ్రహించునది )

ఒ ఓ ఔ—కంఠోష్ఠ్యములు

వ—దంతోష్ఠ్యము

ః క కారమునకు వెనుకనున్న— ( ~ క అను రూపము నొందును) — జిహ్వామూలీయము

ః పకారమునకు వెనుకనున్న — ( ~ ప అను రూపము నొందును) — ఉపధ్మానీయము

## ౧౪. దంత్యతాలవ్యముల వ్యవస్థ

(అ) సాధారణముగా చ వర్గము తాలవ్యమైనది

ఉదా - చక్రవర్తి చంద్రుఁడు చిత్రము చూర్ణము చోరుఁడు చౌలము—మున్నగు పదములలో తాలవ్యోచ్చారణమే యున్నది

అచ్చ తెనుఁగు పదములలోను ఇ ఈ ఎ ఏ లతోఁ గూడిన చ జ లు తాలవ్యములే.

ఉదా - చింత చీకు చెట్టు చీమ జిగురు జీమ జెట్టి జేగురు

(ఆ) అచ్చతెనుఁగులో అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లతోఁ జేరిన చ-జ లు దంత్యములగును.

ఉదా.- చక్కన చాకలి చుక్క చూపు చొక్కము చోటు చౌడు జాగు, జావ జున్ను జూదము జొన్న జోడు జౌక మొదలైనవి

దంత్య చ జ లకు పైన తావత్తుగుర్తు ' ‿ ను పెట్టుట గలదు. అది లేకున్నను వాని స్వరూపమును గుర్తించి పలుక వలెను.

(ఇ) బహువచన ప్రత్యయము పరమైనపుడు ఇకారాంత శబ్దముల తుదివర్ణమునకు వెనుకనున్న చ జ లు దంత్యము లగును.

ఉదా - వీచి+లు=వీచులు రోచి + లు = రోచులు

సంచి+లు=సంచులు రాజి+లు=రాజులు

జాజి వాజి మున్నగు వాని కిట్లే మార్పు గల్గును

(ఈ) అచ్చు రాజు పదములలోని చ జ లు దంత్యములే

## ౧౫. య ర ల వ లు రెండు విధములు

ఉచ్చారణమున దేల్చి పలుకుట-ఊది పలుకుట యను భేదమున య ర ల వ అను వర్ణములు లఘువు లనియు, అలఘువు లనియు రెండు తీరులగును.

లఘు యకారము :- సంధి వశమున వచ్చిన యకారమును లఘు యకార మందురు.

మేన+అత్త=మేనయత్త: హరి+అనెను = హరియనెను.

అలఘు యకారము:- పదమున స్వతస్సిద్ధముగా నున్న యకారమును అలఘు యకార మందురు.

ఉదా ; చాయ. - పాయ, గోయి, నూయి మొదలైనవి.

లఘు వకారము :- సంధి వశమున వచ్చినది.

ఉదా:- చిలుక+ పలికెను = చిలుక వలికెను.

చెట్టు +పడెను = చెట్టు వడెను.

అలఘు వకారము :- పదముతోనే యున్నది.

ఉదా: — పడవ, కలువ

లఘు రేఫము:- ర అనునదియే లఘు రేఫము.

ఉదా :- రచ్చ. వరుస, కనికరము.

అలఘు రేఫము:- బండి ఱ అనబడు నిదియే అలఘు రేఫము. ఈ బండిఱాను శకటరేఫమని కూడ నందురు.

ఉదా:- ఆఱవ, వెఱగు, ఆఱు మొదలయినవి.

లఘు లకారము - సాధారణ లకారమే లఘులకారము.

ఉదా - వల తలగడ వలువ

అలఘు లకారము :- ళకార రూపమున నుండునది అలఘు లకారము.

ఉదా - నెళవు దళవాయి మేళము పళ్ళెము కళ్ళెము ౹త్రాళులు గుమ్మళులు నీళులు మొసళ్ళు.

వీనిలో నెళవు మున్నైన వానిలోనిది స్వతస్సిద్ధము ౹త్రాళులు మొదలైన పదములలోనిది ఆదేశముగా వచ్చినది

—o—

## ౨. పదస్వరూపము

౧. విభక్తితోఁగూడిన మూలశబ్దమును పద మందురు.

రాముఁడు - ఈ పదమును పరిశీలింపుఁడు దీనిలో రాము + ఁడు అను రెండు ఖండములు గనఁబడుచున్నవి రాముని రామునిచే రామునికొఱకు రామునివలన రామునియొక్క రామునియందు అనువానిలో ఒక్కొక్క దానిలోను రాము అను ఖండము మార్పు లేక కనఁబడుచున్నది కావున ఇది మూలఖండము దీనినే ప్రాతిపదికము ప్రకృతి యనియుఁ బిలుతురు ఇఁక అట్టి ప్రాతిపదికముమీఁదఁ జూపట్టు డు-ని - చే - కొఱకు - వలన - యొక్క అందు అనునవియే విభక్తులు వీనికి ప్రత్యయము లనియు పేరు

ధాతువు గాక, ప్రత్యయము గాక, ప్రత్యయము చేరక అర్థవంతమై యుండు శబ్దము ప్రాతిపదిక మని గుర్తింపనది

ఉదా రామ కృష్ణ వృక్ష మగ మొదలైనవి

౨. ఏదేనొక క్రియను దెలుపు (ప్రత్యయము చేరని) శబ్దస్వరూపము ధాతువు.

వచ్చు-పోవు-వ్రాయు-తిను మొదలైనవి

౩. ప్రాతిపదిక ధర్మమును, ధాతు ధర్మమును తెలుపునవి విభక్తులు ·

డు ము వు లు మొదలుగా చెప్పఁబోవునవి ప్రాతిపదికముపై వచ్చు విభక్తులు

ఎను-తివి - ఉన్నాఁడు మొదలుగా చెప్పఁబోవునవి క్రియా విభక్తులు

ఈ విధమైన విభక్తులతోఁ గూడినవియే పదములు. పదము లర్థవంతములై ప్రయోగార్హము లగుచున్నవి.

రాము + ఁడు + వచ్చు + ఎను

రాముఁడు వచ్చెను అను రీతి ప్రయోగింపనర్హములు.

౪. ప్రాతిపదికపై వచ్చు విభక్తులు :

| | |
|---|---|
| డు ము వు లు | ప్రథమా విభక్తి |
| నిన్. నున్ (కూర్చి, గుఱించి) | ద్వితీయా విభక్తి |
| చేతన్, చేన్, తోడన్, తోన్ | తృతీయా విభక్తి |
| కొఱకున్, కై | చతుర్థీ విభక్తి |
| వలనన్, కంటెన్, పట్టి | పంచమీ విభక్తి |
| కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్ | షష్ఠీ విభక్తి |
| అందున్, నన్ | సప్తమీ విభక్తి |

వీనిలో డు ము వు న న్ అనునవి ఏకవచనములు.

లు బహువచనము.

తక్కినవి ఏకవచనమందును బహువచనమందును సమానముగా వచ్చునవి.

## (అ) తత్సమాదిపదములు

౫. ఆంధ్ర భాషాపదములు నాలుగు విధములు.

ఆంధ్రభాషలోని పదజాలమును తత్సమములు, తద్భవములు, దేశ్యములు, గ్రామ్యములు అని నాలుగు తరగతులుగా విడదీయవచ్చును.

## (i) తత్సమము

సంస్కృత భాషలోని పదములకును, ప్రాకృత భాషలోని పదములకును సమానమైన పదములు తత్సమ పదములు.

| ఉదా :- సంస్కృతము | | తత్సమము |
|---|---|---|
| రామః | | రాముఁడు |
| నదీ | | నది |
| వృక్షః | | వృక్షము |
| సంస్కృతము | ప్రాకృతము | తత్సమము |
| శ్రీః | సిరీ | సిరి |
| జటా | జడా | జడ |

## (ii) తద్భవము

సంస్కృత ప్రాకృత భాషలనుండి పుట్టినది తద్భవపదము. (రూప మెక్కువగా మాఱక తెలుఁగులో వ్యవహరింపఁబడునవి తత్సమము లనియు-రూపము మాఱి తెలుఁగులోనికి వచ్చినవి తద్భవము లనియు గమనింపవలెను.)

| సం. | తద్భ | ప్రా | తద్భ |
|---|---|---|---|
| సముద్రః | సంద్రము | లచ్ఛీ | లచ్చి |
| ప్రేమ | పెరిమె | సాణ | సాన |
| లాక్ష | లక్క | పవాళో | పవడము |

తద్భవము లేర్పడు పద్ధతి చిత్రముగా నుండును. కొన్నిచోట్ల మూలపదములలోని వర్ణము లోపించును. కొన్నింటక్రొత్త వర్ణము వచ్చి చేరును. మఱికొన్ని యెడల ఉన్న యక్షరమును త్రోసిపుచ్చి దానికి బదులు వేఱొక యక్షరము వచ్చును. కొన్నికొన్ని పదములలోని యక్షరములు తాఱుమాఱగును.

వర్ణలోపము అలక్తక—తామరసమ్. వీనిలో అ. సమ్ లోపిం
లత్తుక—తామర అయినవి.

వర్ణాగమము · రథః—హితః వీనికి ముందు అ. ఇలు వచ్చి
అరదము, ఇతవుడు అయినవి.

వర్ణాదేశము , సింహః - దీనిలోని హ కారమునకు గ కారవ
వచ్చి సింగ మయినది. రాజసము రాయస మైన దిట్టులే

వర్ణవ్యత్యయము శుచి-దీనిలోని వర్ణములు తారామ్మాఱై చి
అయి పిమ్మట శు ద్విత్వచకారమును పొంది చిచు
అయినది

ప్రాకృత భాషావ్యవహారము క్షీణించుటవలన ప్రకృత కాలమ
ఇది సంస్కృత భవము-ఇది ప్రాకృత భవము అని వెలుగా తెలియ
దుష్కరమైనది. కావున తద్భవ పదములన్నియు సంస్కృత భవము
గానే చూపుచున్నారు ప్రాకృత మొకవిధముగా సంస్కృతి భవ
కావున నిది సమంజసముగానే యున్నదందురు

## (III) దేశ్యము

ఆంధ్రదేశ వ్యవహారమునం దున్నది దేశ్యము.

తత్సమ పదములు తద్భవ పదములు గాక తెలుఁగు దేశమ
ఆబాలగోపాలము వాడుకొను ప్రసిద్ధ పదములు దేశ్యములు

పాడి పంట, ఇల్లు చేను తల్లి తండ్రి చూచెను వచె
మొదలైనవి.

అన్యదేశ్యము :- ఆంధ్రదేశములో వాడుకొను కొన్ని
ములు ఆంధ్రుల సొంత పదములు కావు. అన్యదేశమున
జెందినవి. కాని చాలకాలముగా ఆ దేశీయుల సంబంధ

వలన ఆంధ్రుల వ్యవహారము లోనికి వచ్చినవి, స్థిర పడినవి. అట్టివానిని అన్యదేశ్యము లందురు.

తిరుమాళిగ, తిరుచూర్ణము, తిరుమణి, అడియేను, పేచి, బిడారు, ఆరా, జవాను, రుక్కా, రుజువు, రాస్తా, దస్కతు (దస్థతు), దస్తు, పేనా, పెన్సలు, గవర్నరు, కలెక్టరు, కవరు, కార్డు, మొదలైన తమిళ కర్ణాటక హిందీ పదములు-ఆంగ్లభాషా పదములు నూర్లకొలది వాడుకలో నున్నవి.

గమనిక : కావలెనని యన్యభాషా పదములను ప్రయోగింపరాదు.

మా తండ్రి యనుటకు మా ఫాదరు, నా పుస్తకమనుటకు నా బొక్కు అనురీతిని వ్యవహరించుట యుక్తముకాదు. తెలుగులో ఆ పదము లేనపుడే అన్యభాషా పదమును వాడవలెను.

(iv) గ్రామ్యము

వ్యాకరణశాస్త్ర విరుద్ధమైనది గ్రామ్యపదము.

(ఆకడ అనుటకు) ఆడ — (ఈకడ) ఈడ ఇట్టివియు, వస్తాడు—తెస్తాడు వంటివి లక్షణ విరుద్ధములు. ఇట్టి పదములు గ్రామ్య పదములు.

ఈ సందర్భమున గమనింపఁ దగిన విషయము:—

(అ) లక్షణ విరుద్ధములైనను కొందఱు మహాకవులు ప్రయోగించి యుండినవియు భాషలో పాతుకొని పోయినవియు నగు పదములను వాడవచ్చును. వీనిని అనింద్య గ్రామ్యము లందురు.

కఱకంఠుడు-ప్రాణగొడ్డము - దీపకంబము — నవ్వేరు - చేతురు-కోతురు-మ్రింగేవాడు-దాటేవాడు- రెన్నెల్లు - రెణ్ణాళ్ళు — వేణ్ణీళ్ళు, ఇట్టివి

యెన్నియో కవులు ప్రయోగించినారు. అవి గ్రామ్యములే యని కొందఱ యభిప్రాయము

(అ) నాటకాదులలో భాష పాత్రౌచిత్యమును బట్టి యుండుటయే రసపుష్టికి హేతువు. కావుననే సంస్కృత నాటకములలో స్త్రీ నీచ పాత్రలకు సంస్కృతముగాక ప్రాకృతము వాడఁబడినది. తెలుఁగులో అట్టి పాత్రలకు గ్రామ్యము వాడుచున్నారు.

## (ఆ) భాషా భాగములు

౧ భాషా భాగము లయిదు,

నామవాచకము, సర్వనామము, విశేషణము, అవ్యయము, క్రియ అని యాంధ్రభాషలోని పదములన్నియు నైదు భాగము లగును.

౨ నామవాచకము

(అ) ప్రాణి వస్తు గుణాదులను తెలుపు పదము నామవాచకము.

ఒక ప్రాణినిగాని ఒక వస్తువునుగాని గుణమునుగాని తెలియజేయునది నామవాచకము దీనికే విశేష్యమనియు పేరు.

ఉదా :— రామయ్య పుస్తకము కొండ తెలివి.

(ఆ) నామవాచక భేదములు సంజ్ఞావాచకము, సామాన్యవాచకము, సముదాయవాచకము, గుణాది వాచకము.

సంజ్ఞావాచకము

ఒక ప్రాణి పేరుగాని, ఒక వస్తువు పేరుగాని, ఒక స్థలము పేరుగాని, ఒక ద్రవ్యము పేరుగాని చెప్పునది సంజ్ఞావాచకము.

ఉదా : ప్రతాపరుద్రుడు, రామాయణము, తుంగభద్ర, ఓరుగల్లు, బంగారము.

సామాన్యవాచకము :

ప్రత్యేకముగాఁగాక అందఱికిని, అన్నింటికిని వాచకమైనది సామాన్యవాచకము.

ఉదా : బ్రాహ్మణులు, పురుషులు, స్త్రీలు, ఆవు, వరి.

సముదాయవాచకము :

ఒకజాతికి చెందినవాని సమూహమును తెలుపునది సముదాయవాచకము.

ఉదా : బృందము సేన, మంద, ఘట.

గుణాదివాచకము :

గుణములు, స్వభావములు, దశలు, ధాత్వర్థము లను వానిని తెలుపు పదములు గుణాదివాచకములు.

ఉదా :

గుణములు : మంచి, చెడుగు, తీపి, తెలుపు, మగఁటిమి.

స్వభావములు : ఎత్తు. పొడుగు, పల్చన, చిక్కన. బరువు.

దశలు : బాల్యము, వార్ధక్యము. పుట్టువు. చావు, బ్రతుకు.

ధాత్వర్థములు : రాక, పోక, చేత, చేయమి, చూపు.

## సర్వనామము

3. సర్వనామము నామవాచకమునకు బదులుగా వాడఁబడునదియు, అన్ని, కొన్ని, ఎన్ని, కొందఱు, ఇద్దఱు, అది, ఇది, ఏది, ఎవడు మొదలైనవియు సర్వనామములు.

ఉదా : సర్వము, విశ్వము, అతడు మొ.

ఈ సర్వనామ మైదు విధములు :

పురుష సర్వనామము, నిర్దేశక సర్వనామము, సంబంధ సర్వనామము, ప్రశ్నవాచక సర్వనామము, సంఖ్యావాచక సర్వనామము.

పురుష సర్వనామము :

నీ, మీ, నా, మా, మన, వాడు, ఆమె, వీఁడు, తాను మొదలైనవి ప్రథమాది పురుషములను తెలుపును గావున పురుష సర్వనామములు.

ఉదా : నీవు, మీరు, నేను, మేము, వాడు, వారు మొ.

నిర్దేశక సర్వనామము :

చూపి చెప్పు సర్వనామము నిర్దేశక సర్వనామము.

ఉదా : అల్ల, ఇల్ల, ఉల్ల

ఇవి నామవాచకములతో ప్రయుక్తము లగును.

అల్ల కాంచన రథము (అదిగో ఆ బంగారు రథము అని యర్థము.)

ఇట్లే : అల్లవాడు . ఇల్లది - ఉల్లది

అల దూరమును, ఇల్ల సామీప్యమును, ఉల్ల అంతదూరము-అంత దగ్గఱ కాని మధ్యస్థితిని తెలుపును.

సంబంధ సర్వనామము :

అది, ఆమె, వాఁడు మొదలైన వానితో ఆకాంక్ష సంబంధముగల ఏది, ఎవతె, ఎవఁడు మొదలైనవి సంబంధ సర్వనామములు.

ఉదా : ఏది, ఎవతె. ఎవఁడు, ఎందఱు, ఎంత, ఎన్ని. ఎవరు

'వారిలో నెవఁడు నేర్పరియో వానినిఁ బిలువుము' మొద గా ప్రయోగములు.

ప్రశ్నవాచక సర్వనామము :

ఎవఁడు మొదలైనవి ప్రశ్నార్థకము లగుచో ప్రశ్న వాచక సర్వనామము లగును.

ఉదా :— ఎవఁడు : నా పుస్తకము దీసిన దెవఁడు ?

ఏది : నీ కిలమేది ? ఇట్లే తక్కినవి

సంఖ్యావాచక సర్వనామము :

సంఖ్యను తెలుపునవి సంఖ్యావాచకములు.

ఉదా : ఒకఁడు — ఒకటి, రెండు—ఇద్దఱు. మూడు — ముగ్గురు, మొదలైనవి

## విశేషణము

4. నామవాచకాదులయు, క్రియలయు గుణము, ద్రవ్యము, వ్యాపారములను తెలుపునది విశేషణము.

విశేషణము లాఱు విధములు : గుణాదివాచకము, ద్రవ్యవాచకము, క్రియావాచకము, సంఖ్యావాచకము, క్రియాజన్యము, క్రియావిశేషణము.

గుణాదివాచక విశేషణము :

వ్యక్తి వస్తువుల గుణము, స్వభావము, దశ, శక్తి, సామర్థ్యాదులను బోధించునట్టివి గుణాదివాచక విశేషణము లనఁబడును.

ఉదా : చక్కనిది-చక్కనివాఁడు-ప్రియుఁడు-ప్రియ, నేర్పరి-నేర్పుకత్తె, వన్నెలాడు-వన్నెలాడి.

తెల్లతామర, పిటికిబంటు, చిఱునవ్వు మొదలైన సమస్త పదములలోని మొదటి పదము లన్నియు నిట్టివియే

ద్రవ్యవాచక విశేషణము :

విశేష్యములకుఁ జెందిన ద్రవ్యములను తెల్పునవి ద్రవ్య వాచక విశేషణములనఁబడును. ద్రవ్యమనగా పదార్థము.

ఉదా : ధనవంతుఁడు, ముక్కంటి, చక్రధారి, నెలతాల్పు.

గమనిక : సమాసములలోఁ గొన్నింట విశేష్యములుకూడ విశేషణములగును వెండి పళ్లెము, మంచు కొండ, పట్టు బట్ట మొదలైనవి.

క్రియావాచక విశేషణము :

విశేష్యములకుఁ జెందిన క్రియలను తెల్పునవి క్రియా వాచక విశేషణములు.

ఉదా : బోధకుఁడు, యశస్కరము; కృతజ్ఞుఁడు.

ఇటే దిగుడుబావి, వేపుడు కూర, చూపుడు వ్రేలు మొదలైన సమాసములలోని మొదటి పదములును క్రియావాచకములే.

సంఖ్యావాచక విశేషణము :

(అ) విశేష్య సంఖ్యను తెలుపునవి సంఖ్యావాచకవిశేషణములు.
ఉదా : ప్రథమము, ద్వితీయము మొ.

(ఆ) ఒక శబ్దమేనకు పూరణార్థమున వచ్చు మొదటి అనునదియు, రెండు మొదలగు శబ్దములపై వచ్చు 'అవ' తోఁగూడిన రెండవ, మూఁడవ, నాల్గవ మొదలగు రూపములును సంఖ్యావాచక విశేషణములే. వీనికి స్వతంత్ర ప్రయోగము లేదు. కావున రెండవవాఁడు— మూడవపంక్తి, మున్నగు విధముగా ప్రయోగము లుండును.

క్రియాజన్య విశేషణము :

ధాతువువలనఁ గల్గినవి క్రియాజన్య విశేషణములు.

వచ్చు నుండి వచ్చిన

చేయు నుండి చేసిన
పోవు నుండి పోయిన అనునవి గల్గినవి

ఇట్టి వానినే క్రియాజన్యము లందురు. వీనికి స్వతంత్ర ప్రయోగము లేదు. వాఁడు, అది మొదలైన శబ్దములు వీనివెంట నుండును.

ఉదా : వచ్చినవాఁడు
చేసినపాపము
పుట్టినయూరు

క్రియావిశేషణము :

(అ) క్రియాపదముల ధర్మములను తెలుపునవి క్రియావిశేషణములు. క్రియలెట్లు జరిగినవియు నివి వివరించును.

ఉదా : చయ్యన, తద్ద, పొద్దుచు, పదిగా, చక్కఁగా, ఎంతయు

(ఆ) కొన్ని విశేష్యములు, విశేషణములు, సర్వనామములు, అవ్యయములు, కాన్ అను దానితోను, సముచ్చయముతోను జేరి క్రియా విశేషణము లగును.

ఉదా : కమ్మఁగా పాడెను. ఎంతయు వచ్చెను.

నామవాచకముల లింగములు - మహదాది సంజ్ఞలు

౧. స్త్రీపుంస్త్వాది బోధకము లింగము.

నామవాచకములలోఁ గొన్ని పురుషులను, మఱికొన్ని స్త్రీలను, తక్కినవి పశు పక్షి జడములను బోధించుచున్నవి.

ఈ భేదములను తెలియఁజేయునదియే లింగము

౨. సంస్కృతమున సాధారణముగా లింగము శబ్దాశ్రయమై యుండును. అది పుంలింగము, స్త్రీలింగము, నపుంసక లింగము అని మూఁడు విధములై యున్నది.

| | | |
|---|---|---|
| రామః | (రాముఁడు) | (పుం) |
| సీతా | (సీత) | (స్త్రీ) |
| వనమ్ | (వనము) | (నపుం) |

౩. ఆంధ్రమున లింగ మర్థాశ్రయ మగును.

తెలుఁగులో లింగము తఱచుగా అర్థమునుబట్టి ఆఁడువారిని ఆఁడు జంతువులను, మగవారిని మగ జంతువులను, వీనికి భిన్నములైన యితర పదార్థములను బోధించును.

౪. తెలుఁగుఁలో లింగమునకు మహదాది సంజ్ఞలు గలవు. మహద్వాచకము - మహతీవాచకము - అమహద్వాచకము అని లింగములను తెలుఁగులో వ్యవహరింతురు.

స్త్రీలను బోధించునది మహతీవాచకము. పురుషులను బోధించునది మహద్వాచకము. తదితరబోధకము అమహద్వాచకము.

౫. (అ) దేవమానవాది పురుషవాచకములును వాని విశేషణములును పులింగములు మహత్తులు నగును.

ఉదా : విబుధుఁడు - రాముఁడు - బలవంతుఁడు.

(ఆ) పురాణ ప్రసిద్ధములైన కొన్ని దేవమానవాదులలోఁ జేర కున్నను పుంలిగములు మహత్తులనగును.

గరుత్మంతుఁడు-జాంబవంతుఁడు-హనుమంతుఁడు మొదలైనవి.

(ఇ) ప్రయోగము చేయువాని యిచ్ఛను బట్టి తిర్యక్కులను అప్రాణివాచకములను పుంలింగములు మహత్తులనగును.

ఉదా : గజేంద్రుఁడు, నాగరాజు, మేఘుఁడు, సముద్రుఁడు, హిమవంతుఁడు మొదలైనవి

వక్త వీనిని మహత్తులుగాఁ జెప్పుటవలన నేదియో విశేషార్థము స్ఫురింపజేయఁ గోరుచున్నాఁడని తెలియవలెను. అట్టి వివక్ష లేనిచో నివి గజేంద్రము, నాగరాజము, మేఘము, సముద్రము, హిమవంతము అని అమహత్తులే యగును.

౬. (అ) దేవమానవాది స్త్రీవాచకములును. వాని విశేషణములును స్త్రీ లింగములు, మహతీవాచకములు.

ఉదా : అమరి భార్య, ముగ్ధ. శీలవతి, చెంచెత, ఎమ్మెలాండి.

(ఆ) పురాణ ప్రసిద్ధములైనవి కొన్ని దేవమానవాదులలోఁ జేరకున్నను స్త్రీలింగములు మహత్యర్థములు నగును.

ఉదా . కద్రువ-వినత-ఉలూచి-అంజన.

(ఇ) ప్రయోగించువాని యిచ్ఛను బట్టి కొన్ని తత్సమ పదములు స్త్రీలింగములు మహత్యర్థకము లగును.

ఉదా : గంగ, తమస, రోహిణి.

వీనికి రూపభేద మిటఁ గన్పడకపోయినను క్రియాపద సాహచర్యములోఁ గన్పట్టును.

ఈ వాక్యములను పరిశీలింపుడు.

గౌరీ గంగలు శివునిఁ గై సేసిరి.

కృష్ణా తుంగభద్రలు కలిసినవి.

వీనిలో మొదటి వాక్యమున గంగకు మహతీ వివక్ష యున్నందున క్రియాపదము 'కై సేసిరి' యని తదనుగుణముగా వచ్చినది. రెండవ వాక్యములో ఆ వివక్ష లేనందున క్రియాపదము 'కలిసినవి'యని యమహద్వాచకమున కనుగుణముగా వచ్చినది.

౭. మహన్మహతీ వాచకములుగాని వన్నియు నమహత్తులు. వృక్షలతాదులు, జడములు, అవయవములు, గుణములు, మొదలైన వన్నియును అమహత్తులనఁబడును.

వృక్షము, తీఁగె, శిల, గృహము, కొండ, చేయి, పాతము, జాలి మొదలైనవి.

౮. (అ) స్త్రీ పురుష సామాన్య వాచకములు ఉభయ లింగములు.

దేవత- ప్రజ- అపత్యము- చుట్టము- శిశువు- కవి మొదలైనవి ప్రయోగమునుబట్టి మహత్తులు—మహతులుగాఁ గూడఁ గన్పడును.

ఉదా : శ్రీమన్నారాయణుఁ డిష్టార్థముల నిచ్చు దేవత

శ్రీరమాదేవి కెనయగు దేవత లేదు.

నన్నయభట్టారకుఁడు కవి.

రామభద్రాంబ కవి.

అతఁడు వీని చుట్టము

ఈరీతిగా ప్రయోగములవలనఁ దక్కినవియుఁ దెలియఁదగును.

(ఆ) మృగ పక్ష్యాదులలోను స్త్రీ పురుష సామాన్యములు ఉభయ లింగములు. కాని యవి అమహత్తులుగానే యుండును.

ఉదా : గుఱ్ఱము కుక్క కోడి పావురము, పాము, తేలు మొదలైనవి.

౯. సర్వనామములకును మహాదాది సంజ్ఞలు కలుగును.

(అ) ఉదా . వాఁడు—అతఁడు, వీఁడు—ఇతఁడు, ఎవఁడు—ఎవరు, ఒకఁడు, ఇద్దఱు, ముగ్గురు, వారు, వీరు, మొదలైనవి మహ దర్థకములు.

(ఆ) ఆమె, ఈమె—ఈపె, ఎవతె, ఒకతె—ఇవి మహతీ వాచకములు. అనాదరాద్యర్థములలో అది—ఇది యనునవియు మహతులే.

(ఇ) అది — ఇది, అవి — ఇవి, ఒకటి, రెండు మున్నగునవి అమహత్తులు.

౧౦. విశేష్యముల మహన్మహత్త్వమహత్త్వల ననుసరించియే వాని విశేషణ సర్వనామక్రియా పదములను ప్రయోగింపవలెను.

ఉదా : శ్రీరాముఁడు దయాసముద్రుఁడు వానిఁబోలిన ఱేఁడెందును లేఁడు.

ఇట శ్రీరాముఁడు విశేష్యము. మహద్వాచకము. కావున దయాసముద్రుఁడు అను విశేషణము — వానిఁబోలినఱేఁడు అను దానిలో వాని సర్వనామ భాగము. లేఁడు అను క్రియా పదము మహదర్థకములుగానే ప్రయోగింపబడినవి. ఇట్లే తక్కినవాని నెఱుంగునది.

## వ చ న ము

౧. ప్రాతిపదికార్థగతమైన సంఖ్యను వచించునది వచనము.

౨. సంస్కృతమున వచనములు మూడు.

| ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|
| రామః | రామౌ | రామాః |
| (రాముఁడు) | (ఇద్దఱు రాములు) | (చాలమంది రాములు) |

౩. ఆంధ్రమున వచనములు రెండు.

ఏకవచనము - బహువచనము అని తెలుఁగులో రెండే విభక్తులు.

(ఏక) రాముఁడు. (బహు) రాములు.

౪. ఏకత్వబోధక మైనది ఏకవచనము.

ఒకఁడు, ఒకతె, ఒకటి అని ప్రాతిపదికార్థమును తెల్పునది ఏకవచనము.

ఉదా : రాముఁడు – వృక్షముఁ

రాముఁడు ఒకఁడని వృక్షము ఒకటియని తెలియుచున్నది.

౫. ఒకటికన్న ఎక్కువ సంఖ్యను తెలుపునది బహువచనము.

ఉదా : రాములు-వృక్షములు.

జ్ఞాపిక : డు ము వు నన్ అను ప్రత్యయములు ఏకవచనమునను, లు బహువచనమునను, తక్కిన నిన్ చేత మొదలైనవి ఏకవచన బహువచనములయందు సమానముగాను వచ్చును.

౭. కొన్ని పదములు నియత వచనాంతములు.

ఆంధ్ర భాషలోఁగల కొన్ని పదములు నియతముగా ఏకవచనాంతములుగాను; మఱికొన్ని పదములు నియతముగా బహువచనాంతములుగాను జూపట్టుచున్నవి. వీనిని నిత్యైక వచనాంతము లనియు నిత్య బహువచనాంతము లనియు బిలుతురు.

దేవుడు (నిత్యైకవచనము); సురలు (నిత్యబహువచనము) సమాసములో భూదేవులు—భూసురుఁడు అనవచ్చును.

౮. నిత్యైక వచనాంతములు.

(అ) సస్యవాచకపదములు ;

ఆరుగ, కంది, గంటి. చోడి. జొన్న, మినుము మొ.

ధాన్యవాచకములైనపుడివి ఆరుగులు, కందులు అనురీతిగా మాఱునుఁ

(ఆ) సంభారవాచకము :

ఆముదము, చమురు, జీలకఱ్ఱ చింతపండు, పసుపు మొ.

(ఇ) లోహవాచకములు :

బంగారము, వెండి, ఇత్తడి, రాగి, ఉక్కు మొ.

(ఈ) గుణవాచకములు :

నలుపు, తెలుపు, ఎఱుపు, పసుపు మొ

(ఉ) రసవాచకములు :

తీపి, పులుపు చేదు, ఒగరు, కారము మొ.

(ఊ) తుల్యార్థకములు :

ఈఁడు, ఎన, సరి, సాటి మొ.

౮. నిత్యబహువచనాంతములు :

(అ) క్రీడా విశేషవాచకములు :

ఆంధ్రములోనున్న కొన్ని యాటలను తెలుపుపదములు నిత్యబహువచనాంతములై యుండును.

అచ్చనగాయలు, ఉప్పనబట్టెలు, ఓమనగుంటలు, కోతికొమ్మచ్చులు, కుప్పిగంతులు, గుజ్జెనగూళ్ళు, దాఁగుడుమూతలు మొ.

(ఆ) ధాన్యవాచకములగు పదములు :

వడ్లు, పెసలు, కందులు మొ.

(ఇ) అందఱు, కొందఱు, పెక్కు-రు, పెక్కం౦డ్రు, అదరులు, ఎండువులు, మిడుగురులు, మొదలగు కొన్ని పదములు.

ఇరులు - కేలు అను పదములు నిత్యబహువచనాంతములని కొందర మతము.

౯. గౌరవార్థమున వారు, గారు వచ్చును.

దేవరవారు, శ్రీరాములవారు. గురువుగారు మొ.

౧౦. ఎవరు - ఉభయార్థకముగా ప్రయుక్తమగును.

(ఏక) నీవు ఎవరు ?

(బహు) మీరు ఎవరు ?

౧౧. కొన్నిపదములమీఁద బహువచనములపై బహువచనములు చూపట్టును.

వీరు - వీరలు- మీరు—మీరలు, వారు - వారలు,

కొడంర్డు-కొడం్డురు, కొడవండ్లు—కొడవండ్లులు.

## బహువచనమున కొన్ని విశేషములు :

౧౨. పగతుఁడు మొదలైన పదముల బహువచన లకారమునకు రేఫము వచ్చును.

పగతు + లు = పగతురు.

నెయ్యురు, బలియురు మొ.

౧౩. గండఁడు మొదలైన పదముల బహువచన లకారమునకు రేఫమును, దానిముందు పూర్ణబిందు పూర్వకమైన డకారమును వచ్చును.

గండ+లు=గండండ్రు. ఇట్లే మిండండ్రు మొ.

౧౪. కాప్రత్యయాంత శబ్దముల మీఁది బహువచన లకారమునకు రేఫము బండిఱ వచ్చును. రేఫమునకుముందు పూర్ణబిందు పూర్వకమైన డ కారము వచ్చును.

| (ఏక) | (బహు) |
|---|---|
| విలుకాఁడు | విలుకాండ్రు, విలుకాఱు |

ఇట్లే వేటకాఁడు మొదలైనవి.

౧౫. ఈ పదముల బహువచన రూపములను పరిశీలింపుఁడు :

| (ఏక) | (బహు) |
|---|---|
| ఱేఁడు | ఱేఁడులు, ఱేండ్లు |
| ఆలు | ఆండ్రు |
| చెలియలు | చెలియండ్రు |
| చెల్లెలు | చెల్లెండ్రు చెల్లెళ్లు |
| కోడలు | కోడండ్రు కోడండ్రురు, కోడళ్ళు |
| గుండు | గుండులు, గుండ్లు, గుళ్ళు |
| బండి | బండులు, బండ్లు, బళ్ళు |
| బడి | బడులు, బళ్ళు |
| ఊరు | ఊరులు, ఊఱులు, ఊళ్ళు |
| పేరు | పేరులు, పేఱులు, పేళ్ళు |
| కొడవలి | కొడవలులు, కొడవఱులు, కొడవళ్ళు, కొడవండ్లు, కొడవండులు |
| నాగలి | (పై విధముగా) |
| రోకలి | ,, |

| (ఏక) | (బహు) |
|---|---|
| పల్లు | పండులు, పండ్లు, పళ్ళు |
| కన్ను | కన్నులు, కండ్లు, కళ్ళు |
| కొలను | కొలఁకులు |
| మ్రాను | మ్రాఁకులు |
| రేను | రేఁగులు |
| గోను | గోఁగులు |
| చేను | చేలు |
| పేను | పేలు |
| మీను | మీలు |
| వ్రాయి | వ్రాలు |
| రాయి | రాలు, రాళ్ళు |
| చేయి | చేతులు |
| గోయి | గోతులు |
| నేయి | నేతులు |
| బాలుఁడు | బాలురు |
| జాము | జాములు, జాలు |
| చుట్టము | చుట్టలు, చుట్టాలు, చుట్టములు |
| మీసము | మీసలు, మీసాలు, మీసములు |
| కూఁతురు | కూఁతులు, కూఁతుళ్ళు, కూఁతుండ్రు |
| వాఁడు, ఆమె | వారు, వారలు, వాండ్రు |
| వీఁడు, ఈమె | వీరు; వీరలు, వీండ్రు |
| ఎవఁడు, ఏమె, ఎవతె | ఎవరు, ఎవరలు, ఎవండ్రు |
| అది. అద్ది | అవి, అవ్వి |
| ఇది, ఇద్ది | ఇవి, ఇవ్వి |
| ఎది, ఎద్ది | ఎవి, ఎవ్వి |

| (ఏక) | (బహు) |
|---|---|
| తాను | తాము, తమరు, తారు |
| నేను, ఏను | మేము, ఏము |
| నీవు, ఈవు | మీరు, ఏము |
| నేను+నీవు | మనము |

౧౬. సంఖ్యావాచకములు

| | | |
|---|---|---|
| మహత్తు : | ఒకఁడు, ఒక్కఁడు, ఒండు మొ. | ఒకరు, ఒక్కరు, ఒకళ్ళు మొ. |
| మహతి : | ఒకరితె, ఒక్కరితె, ఒక్కర్తె, ఒకతుక, ఒక్కర్తుక, ఒకతె, ఓర్తు మొ. | ఒకరు, ఒక్కరు, ఒకళ్ళు మొ. |

| అమహత్తులు | మహన్మహతులు |
|---|---|
| రెండు | ఇద్దఱు-ఇరుగురు-ఇర్వురు-ఇరువురు |
| మూఁడు | మూగురు, మూవురు, ముగ్గురు, మువ్వురు |
| నాలుగు | నలువురు-నలుగురు-నల్వురు-నల్గురు |
| అయిదు | అయిదుగురు |
| ఏను | ఏగురు |
| ఆఱు | ఆఱుగురు-అర్గురు-అర్వురు |
| ఏడు | ఏడుగురు-ఏడ్వురు-ఏడ్గురు |
| ఎనిమిది | ఎనమండ్రు |
| తొమ్మిది | తొమ్మండ్రు |
| పది | పదుగురు-పదురు-పదుండ్రు-పదుగుండ్రు |
| పదునొకటి | పదునొకరు |
| పండ్రెండు | పన్నిద్దఱు-పన్నిరుగురు-పన్నిరువురు |
| పదుమూఁడు | పదుమూగురు, పదుముగురు, పదుముగ్గురు |

| (ఏక) | (బహు) |
|---|---|
| పదునాలుగు | పదునలుగురు |
| పదునైదు-పదునేను | పదునయిదుగురు-పదునేగురు |
| పదునాఱు | పదునాఱుగురు |
| పదునేడు | పదునేడుగురు |
| పదునెనిమిది | పదునెనమండ్రు |
| పందొమ్మిది | పందొమ్మండ్రు |
| ఇరువది | ఇరువండ్రు |
| ముప్పది | ముప్పండ్రు |
| నలువది | నలువండ్రు |
| ఏఁబది | ఏఁబండ్రు |
| అఱువది | అఱువండ్రు |
| డెబ్బది | డెబ్బండ్రు |
| ఎనుబది | ఎనుబండ్రు |
| తొంబది | తొంబండ్రు |
| నూఱు | నూరుగురు-నూర్వురు-నూర్గురు-నూరువురు |
| వేయి | వేగురు, వేవులు |
| పదివేలు | పదివేగురు, పదివేవురు |

## (ఇ) పద ప్రక్రియ

ప్రాతిపదికము మీఁద ప్రథమాది విభక్తి ప్రత్యయములు చేరుట వలనఁ బదము లేర్పడును. అట్టియెడ మూలపద స్వరూపములోఁ గొన్నిమార్పులు వచ్చును. ఆ మార్పులెట్లు వచ్చినవియో వివరించి పద స్వరూపమును నిరూపించుటను ప్రక్రియ యందురు.

రామ+డు అనునది రాముడు అయినది. మొదటి స్థితిలోలేని మకారము మీఁది ఉ ఎక్కడిదో, దానిపై అరసున్న యెట్లు వచ్చెనో మొదలైన సంగతులను తెలుపుటయే ప్రక్రియ.

'డు' ప్రత్యయాంతముల ప్రక్రియ :

౧. డుమంత స్త్రీసమ పదములు పారిభాషికములు.

ముందు ముందు డుమంతము లనియు, స్త్రీ సమము లనియు వినవచ్చు పదములు లక్షణ పరిభాషకుఁ జెందినవి. విశిష్టార్థము నిచ్చునవి. వాని వివరణము :

డుమంతములు : ప్రథమైక వచనమున డు అను ప్రత్యయము కనఁబడునట్టి రామకృష్ణాది తత్సమ శబ్దములును, అచ్చతెనుఁగులో మహద్వాచకములయిన బల్లిదాది పదములును మగాది పదములును, తమ్ము-అల్లు మొదలైనవియు అ-ఈ-కా-గా ప్రత్యయాంతములును. అమహద్వాచక కయిరాదులును, వాఁడు, వీఁడు మున్నైన సర్వనామములును డుమంతములు.

స్త్రీసమములు : ప్రథమైక వచనమున డు-ము-వు ప్రత్యయములలో నేదియుఁ గన్పడని పదములు స్త్రీసమములు. అట్టివానికి స్త్రీలింగ శబ్దములకు వలెనే వ్యాకరణ కార్యములు వచ్చును.

౧. మహద్వాచకములైన తత్సమ నామములయొక్కయు, బల్లిదాదుల యొక్కయు కడపటి అ కారమునకు ఉ కారము బహుళముగా వచ్చును.

ఉదా : రామ రాము అయినది.

౨. మిత్రాదులయు - దూతాదులయు కడపటి అ కారమునకు ఉ కారము వికల్పముగా వచ్చును. మగ, కయిరాదుల కడపటి అ కారమునకు రానేరాదు.

౩. మహద్వాచకములై డుమంతములైన నామములకును, కయిరాదులకును ప్రథమైక వచనమునకు డు ప్రత్యయము వచ్చును.

ఉదా : రాము+డు అని యేర్పడినది,

౪. నామముతోఁ గలిసినపుడు డు ప్రత్యయము వెనుక బిందువు వచ్చును.

ఉదా ; రాముఁడు-పూర్ణబిందువు వచ్చిన రాముండు అనియగును. ఇట్లే మిత్రుఁడు-దూతుఁడు-గురుఁడు-విధాతృఁడు-బల్లిదుఁడు-తమ్ముఁడు మగఁడు-కయిరఁడు మొదలైనవి గ్రహించునది.

కయిరాదులు : కయిరఁడు - కత్తళఁడు - జన్నఁడు - నీలఁడు - బొల్లఁడు మొదలైనవి.

మగాదులు ; మగఁడు, మనుమఁడు, రాయఁడు, నాయఁడు, భూపఁడు, రంగఁడు. లింగఁడు, పాపఁడు, బిడ్డఁడు, పిల్లఁడు, కుఱ్ఱఁడు, గరుడఁడు. మాలఁడు, గొల్లఁడు. వ్రేఁడు, ఱేఁడు, వన్నెలాఁడు, మావటీఁడు, ఎల్లిగాఁడు, చెలికాఁడు, అందగాఁడు ఇత్యాదులు.

౫. ఒడయఁడు, నాయఁడు, రాయఁడు వంటి కొన్నింట తుది అ కారమునకు ఉ కారము చూపట్టును.

ఉదా : ఒడయుఁడు, నాయుఁడు, రాయుఁడు.

౬. బహువచనమున లు ప్రత్యయము వచ్చును.

ఉదా : రాము+లు=రాములు. ఇట్లే తక్కినవి.

౭. సంబోధనమున బదము తుది ఉ కారమునకు అ కారము బహువచన లు ప్రత్యయమునకు అర అను ఆగమము వచ్చును.

౮. సంబోధనమున పదము మొదట ఓ కారము వచ్చును. ప్రేమ గౌరవ నీచతాదులఁబట్టి కొన్నింటికి ఓయి, ఓసి. ఓరి అనునవియు ముందు వచ్చును.

ఉదా : రాముఁడు+అ = రాముఁడ. ఓ చేరఁగా (ఏక) ఓ రాముఁడ. (బహు) ఓ రాములార.

౯. (అ) సంబోధనమున పదముల తుదనున్న అ కారము నకు, ఇ కారమునకు వైకల్పికముగా దీర్ఘము వచ్చును.

(ఆ) సంబోధనమునఁ దత్సమపదముల ఉ కారము మీఁది డు ప్రత్యయమునకు లోపము వైకల్పికముగా వచ్చును. అట్టియెడ ఉ కారమునకు అ కారము వచ్చును. స్వతస్సిద్ధమైన ఉ కారాంతములకు అ కారము రాదు.

ఉదా : ఓ రామ, ఓ రాముఁడ, ఓ రామా, ఓ రాముఁడా, ఓ రాములార, ఓ రాములారా

౧౦. (అ) డుమంతములకును, ఇ వర్ణాంతములకును, ఐ కారాంతములకును ద్వితీయైకవచనమున 'ని' ప్రత్యయమును, బహువచనమున 'ను' ప్రత్యయమును వచ్చును.

(ఆ) తక్కిన పదముల కన్నింటికిని ఏకవచన బహువచనములు రెండింటిలోను 'ను' ప్రత్యయమే వచ్చును.

ఉదా : రాము+ని=రాముని.

౧౧. మహద్వాచకములైన సర్వనామములకును, మగాదులకును, కయిరాదులకును, ద్వితీయాదుల యేకవచనము లందు నిత్యముగాను, తక్కిన డు మంతములకు వైకల్పికముగాను ని వర్ణమాగమ మగును.

ఉదా : రాము ని - రామునిని. (ఏ. వ)

౧౨. ఎల్ల నామములకును ద్వితీయాది బహువచన ప్రత్యయములు పరమగు నపుడు లవర్ణ మాగమమగును.

ఉదా : రాము+ను అని యుండగా ను అను దానిముందు ల వచ్చి రాములను అయినది.

ఇట్లే : (తృతీయ) - రాముని చేతన్ - రాముల చేతన్

(చతుర్థి) - రాముని కొఱకు - రాముల కొఱకు

(పంచమి) - రాముని వలన -రాముల వలన

౧౩. నీ మీ శబ్దములకుఁ దప్ప ఇ వర్ణము మీఁదను, ఐ కారము మీఁదను 'కిన్' అను షష్ఠీవిభక్తి ప్రత్యయమును, తక్కిన యచ్చు లన్నిటిమీఁదను 'కున్' అను ప్రత్యయమును వచ్చును.

౧౪. ఉకార ఋకారముల మీఁద షష్ఠీ విభక్తియందు న వర్ణాగమము బహుళముగా వచ్చును.

(షష్ఠి) రాముని యొక్క — రాముల యొక్క
రామునికిన్ — రాములకున్

౧౫. ఉకారాంతమైన జడవాచకముల మీఁద 'అందు-నన్' అను సప్తమీ విభక్తి ప్రత్యయములు రెండును, తక్కిన శబ్దముల మీఁద 'అందు' అనునదియు చేరును.

రాముని+అందు=రామునియందు.

౧౬. అందు పరమైనప్పుడు ఉకార ఋకారములకు నిత్యముగాను ఆగమ ము వర్ణము మీఁదను, అమహద్వాచకముల ఆగమ వు వర్ణము మీఁదను వైకల్పికముగాను నకార మాగమ మగును.

(రాముని+అందు) నకారాగమము వచ్చి రామునందు

(సప్తమి) రామునియందు (ఏ) రాములయందు (బ)
రామునందు ,, రాములందు ,,

ఈ శబ్దరూపములను గుర్తింపుడు :

| | | |
|---|---|---|
| (ప్ర) | రాయఁడు | —రాయలు |
| (సం. ప్ర) | ఓరాయఁడ | -ఓరాయలార |
| | ఓరాయఁడా | -ఓరాయలారా |
| (ద్వి) | రాయనిని | -రాయలను |
| (తృ) | రాయనిచేత | -రాయలచేత |

| | | |
|---|---|---|
| (చ) | రాయని కొఱకు | -రాయల కొఱకు |
| (పం) | రాయని వలన | -రాయల వలన |
| (ష) | రాయని యొక్క | రాయలయొక్క |
| | రాయనికి | -రాయలకు |
| (స) | రాయనియందు | -రాయలయందు |
| | | రాయలందు |

గమనిక: రామ శబ్దమువలె గోవిందుఁడు-పాత్రుడు-యోధుఁడు-శంభుఁడు సవితృఁడు (వీనికి రూపాంతరము లున్నవి) బల్లిదుఁడు-కొమరుఁడు మొదలైన వానిని గ్రహింప వలెను.

రాయఁడు శబ్దమువలె మగఁడు, మనుమఁడు, కయిరఁడు మొదలైన వానిని దెలియవలెను.

౧౭. (అ) ఉకారాంతములైన తత్సమ ప్రాతిపదికములకును, గోశబ్దమునకును ప్రథమైక వచనమున వు ప్రత్యయము వచ్చును.

ఉదా : మనువు-వధువు-ధేనువు-గోవు మొ.

(ఆ) గుర్వాదులకు కొన్నింటికి వు ప్రత్యయము వికల్పముగా వచ్చును. వు రాని పక్షమున డు వచ్చును.

ఉదా : గురువు - గురుఁడు. ఇట్లే - విష్ణు-వటు - విభు - వసు మొదలైనవానిని గ్రహింపవలెను.

౧౮. అకారాంతములు, అమహద్వాచకములు నయిన తత్సమ నామములకును, కళత్రాదులకును ప్రథమైక వచనమున ము ప్రత్యయము వచ్చును.

ఉదా : వనము-జలము మొదలైన అకారాంతామహత్తులిట్లే. కళత్రము (మహతీవాచకము)

౧౯. మహత్తులైన మిత్రాదులకు డు వికల్పముగా వచ్చును.

ఉదా : మిత్రము-మిత్రుఁడు, శరణ, ప్రధాన, పాత్ర, జన పదము లిట్టులే, [ఇట జన శబ్దము వ్యక్తివాచకము.)

౨౦. విధాత్రాదులకు డు ప్రత్యయము వికల్పముగా వచ్చును.

ఉదా : విధాతృఁడు.

౨౧. ఋ కారాంతముల తుది ఋ కారమునకు అ కారమగును. అవి స్త్రీ సమములు.

దీనివలన విధాతృ శబ్దమునందలి ఋ కారమునకు అ కారము వచ్చి విధాత అయినది.

కావున విధాతృఁడు-విధాత యని రెండు రూపములు. సవితృఁడు-సవిత, నేతృఁడు-నేత మొదలైనవి.

౨౨. దాతృ, పితృ మొదలైన కొన్నింటికి డు వర్ణము రాదు. దాత పిత మున్నగున్నవి.

౨౩. (అ) వృద్ధాదుల డు వర్ణము బహుళముగా లోపించును.

ఉదా : వృద్ధు-వృద్ధుఁడు.

ఇట్లే : నీచ, చార్వాక, గృహస్థ. ధూర్తాదిశబ్దరూపములుండును.

(ఆ) భట్టు శబ్దమునకు డు లోపము నిత్యము.

ఉదా : నన్నయభట్టు.

౨౪. దూతాదులు బహుళముగా స్త్రీ సమములు.

ఉదా : దూత-దూతుఁడు. (స్త్రీ సమమైనపుడు దూత కానపుడు డు ప్రత్యయము వచ్చి దూతుఁడు అగును.)

ఇట్లే : యోధ, శంఠ, మున్నగునవి.

గమనిక : అమహద్విశేషణ మైనపుడు దూత యనియే రూపము.

౨౫. మత్వర్థీయాంత వస్వంతముల ద్వితీయైకవచన రూపములు తెలుఁగున నామములగును. అగుచో వాని తుది మ కారము లోపించును.

మతుప్ ప్రత్యయము అంతమందుగల పదములు శ్రీమత్ మొదలైనవియు, వస్ ప్రత్యయ మంతమందుగల విద్వస్ మొదలైనవియు వాని ద్వితీయాంత రూపమున ప్రాతిపదికలుగా నిల్చునని భావము.

శ్రీమంతమ్-విద్వాంసమ్ అని యుండఁగా మ్ లోపించి శ్రీమంత-విద్వాంస అనురూపమున తెలుఁగులో ప్రాతిపదికములైనవి

౨౬. మహద్వాచకములైన తత్సమ మతుబంత వస్వంత నామములు రామశబ్దము వంటివి.

ఉదా :- శ్రీమంతుఁడు, విద్వాంసుఁడు మొ.

౨౭. కొన్ని మతుబంతముల ప్రథమైక వచన రూపమే వికల్పముగా ప్రాతిపదికమగును. దానికి ఉకారమాగమమగును.

భగవాన్ + ఉ=భగవాను. హనుమాన్+ఉ= హనుమాను. వీనికి రామశబ్దమువలెనే రూపములుండును.

ఉదా : భగవానుఁడు - హనుమానుఁడు

భగవంతుఁడు - హనుమంతుఁడు.

(హనుమ అనియు ప్రయోగము కలదు.)

౨౮. ఋత్విక్-వణిక్-పురోధస్-ఇంద్రజిత్-పరీక్షిత్-ఈ శబ్దముల ద్వితీయైక వచన రూపములు వికల్పముగా ప్రాతిపదికము లగును. చివరి మకారము లోపించును.

ఋత్విజమ్ - వణిజమ్ మొదలైనవి ద్వితీయైకవచన రూపములు. వాని మ్ లోపింపఁగా ఋత్విజ -వణిజ అగును. వానికి ఉత్వము, డు ప్రత్యయాదులు వచ్చును.

ఉదా : ఋత్విజుఁడు - వణిజుఁడు మొ.

౨౯. కొన్ని హలంత ప్రథమైక వచనములే తెలుఁగులో ప్రాతిపదికము లగును. వాని తుది హల్లునకు ద్విత్వము-ఉకారములు వికల్పముగా వచ్చును.

ఉదా : ఋత్విక్ - అనుదాని క్ ద్విరుక్తమై ఋత్విక్ క్ అయి దానికి ఉకారమువచ్చి ఋత్విక్కు అయినది. ఇట్లే వణిక్కు, వణిజుఁడు అనునట్లుగా రెండు రూపములు పురోధసాది శబ్దములకు వచ్చును. ఇంద్రజిత్తు-ఇంద్రజిత్తుఁడు-ఇంద్రజిత్ అని మూడు రూపములు గలవు.

అహస్సు మొదలైన వానిలో ద్విత్వము నిత్యము. సరస్సు - సరసు, శిరస్సు-శిరస్సు, మనస్సు—మనసు మొదలైనవానికి ద్విత్వము వికల్పమని తెలియవలెను.

మరుతు-వేధ-పురోధ అనియు రూపములు గలవు. అంగిరుఁడు-అంగిరసుఁడు-ప్రచేతుఁడు-ప్రచేతసుఁడు మొదలైనవి ద్విరూపములు.

౩౦.(అ) విశ్వకర్మాది శబ్దముల నకారము లోపించును. వానికి స్త్రీసమత్వము బహుళముగా నగును.

ఉదా : విశ్వకర్మ-విశ్వకర్ముఁడు -ఇట్లే ఆత్మదేవ-శర్మ-కృతవర్మ-పరమాత్మ-పూష-మొదలైనవి.

(అ) సుధన్వాదులకు స్త్రీ సమత్వము లేదు.

ఉదా : సుధన్వుడు

ఇట్లే సుత్రామ, సుపర్వ, సహజన్మ, మున్నగునవి.

## ము ప్రత్యయాంతములు

౩౧. తెనుఁగులో ఎకారాంతములు, ఆకారాంతములు, మువర్ణ యోగ్యములు నగునవి జలశబ్ద సమములు.

జలశబ్దమునకు వచ్చినట్లుగా వీనికిని ముఖప్రత్యము వచ్చును. అన్నె - పున్నె - బల్లె - బత్తె - పద్దె - ఒరె మొదలైనవి ఎకారాంతములు.

మొగ వియ్య బెల్ల పల్ల సన్న మొదలైనవి అకారాంతములు

ఉదా : అన్నె+ము=అన్నెము | ఇట్లే తక్కినవి.
మొగ+ము=మొగము |

౩౨. ము వర్ణకము రాఁదగిన అకారాంతములకు ప్రథమా బహువచనాదులు పరమగుచో మువర్ణ మాగమమగును.

ఉదా: జలములు- మొగములు.

౩౩. ము ప్రత్యయ, ము వర్ణములకు ద్విత్వమేని, పూర్ణ బిందు పూర్వక బు వర్ణమేని వికల్పముగా వచ్చును.

ఉదా : జలమ్ము - జలంబు-జలము.

మొగమ్ములు- మొగంబులు-మొగములు,

ఈ ద్విత్వాది కార్యము లన్ని విభక్తులందును వచ్చును.

౩౪. చరిత్రాదులకు ము వర్ణకము వికల్పముగా వచ్చును.

ఉదా : చరిత్ర - చరిత్రము, అభిలాష-అభిలాషము.

ఇట్లే : చిహ్న, ప్రశ్న, నిష్కర్ష, ప్రయాగ, విసర్గ, హంస, వధ, దేశ, ఘోష సర్గ, పురుష, స్ఫురణ, గద్య, కర్మధారయ, విమర్శ, పరామర్శ, భ్రమ, క్రమ తత్పురుష, విజృంభణ, మధ్య మొదలైనవానికి రెండు రూపములు వచ్చును.

అక్షతలు – తరంగలు ఇట్టివే.

౩౫. ము లోపము వచ్చినపుడు కొన్ని నామముల తుది అకార మునకు ఉ కారము వచ్చును.

ఉదా : భీభత్సము-బీభత్సు. రూపము రూపు, శరణము—శరణు, వర్గము—వర్గు

౩౬. ఆత్మ శబ్దమునకును, అమహద్వాచకములైన నకారాంత శబ్దములకును తెలుఁగున న కారము లోపించును. ము ప్రత్యయము బహుళముగా వచ్చును.

ఉదా : ఆత్మ—ఆత్మము, మహిమ-మహిమము.

ఇట్లే : గరిమ, లఘిమ, అంశిమ, జన్మ, కర్మ, ప్రేమ మొ.

౩౭. అమహద్వాచకములయిన కొన్ని హలంతముల తుది వరము బహుళముగా లోపించును. లోపించినపుడు. అకారము మీఁద ము వర్ణమువచ్చును,

ఉదా : (జగత్) జగము, (ఉరస్) ఉరము. ఇట్లు తేజము, మనము. వక్షము. శిరము, తేమము మొదలైనవి.

౩౮. కంధరాదులకు ము వర్ణము బహుళము.

ఉదా : కంధర-కంధరము. ఇట్లు నాసిక, భిక్ష, దంష్ట్ర, గ్రీవ. ఉల్క పాదుక మొ.

విధశబ్దమునకు విధము అని యొక్కరూపమే గుర్తింపఁ దగును.

౩౯. రచనాదులకు ము వర్ణకము బహుళము.

ఉదా : రచనము-రచన.

ఇట్లే గణన. పాలన, విజ్ఞాపన, విమర్శన. భజన, బోధన, శోధన, ఆలోచన. యోజన, సృజన, సంతర్పణ, పోషణ, స్మరణ, వర్ణణ, మొదలైనవి.

౪౦. లు - ల - నన్-న పరమగునపుడు పెక్కుశబ్దముల అగమ ము వర్ణమునకు లోపమును దానివెనుకటి యచ్చునకు దీర్ఘమును బహుళముగా వచ్చును.

ఉదా : ప్రాణము - ప్రాణాలు ప్రాణాన, పెక్కుచందాలన్. ఇట్లే స్నానము, పగడము, ముత్యము, మిరియము మొ.

౪౧. ము వర్ణకము పరమైనపుడును, అవసానమందును ఇయకు ఎకారము బహుళముగా నగును.

ఉదా : పళ్ళియము—పళ్లెము, ఇట్లు కళ్లెము. ముత్తెము, పీడెము, కన్నె. వన్నె, చిన్నె, దవ్వె మొదలైనవి.

## వు ప్రత్యయాంతములు

'ఉకారాంతములైన తత్సమ ప్రాతిపదికములకును, గోశబ్దమునకును ప్రథమైక వచనమున వు ప్రత్యయము వచ్చును' అను సూత్రము

వలన గురు-వధు-గో శబ్దములమీఁద వు రాఁగా గురువు - వధువు-గోవు మొదలైన రూపము లగును.

౪౨. గో వధ్వాదులకు నిత్యముగాను, ఉకారాంత తత్సమ నామములకు బహుళముగాను ప్రథమా బహువచనాది విభక్తులు పరమగునపుడు వు వర్ణ మాగమ మగును.

ఉదా : గో+లు=గో+వు+లు=గోవులు.

వధు+లు=వధు+వు+లు=వధువులు

తను, సుభ్రు, సుతను, పునర్భు మొదలైన విట్టితే.

వు ప్రత్యయము, వు వర్ణములు వచ్చు సందర్భములో గమనింప దగినవి :

(అ) గుర్వాదులకును, శతక్రతు, శతమన్యు, మధు, ప్రభు, విధు, భాను, భృగు, జిష్ణు, రోచిష్ణు, ఆజానుబాహు మొదలగు పుంలింగ ములకును డు-వు ప్రత్యయములు రెండును వచ్చును.

(అ) పాండు, కురు, పూరు, శంతను, అభిమన్యు, కంతు మొద లగు వానికి వుప్రత్యయము రాదు. డుప్రత్యయమే వచ్చును.

౩. (అ) మహత్తులయిన మన్వాదులకును, అమహత్తులైన మేర్వాదులకును వు ప్రత్యయ వు వర్ణాగమములు నిత్య ముగా వచ్చును.

ఉదా : మనువు- మవునులు, మేరువు- మేరువులు.

(అ) అమహత్తులలోఁ గొన్నింటికి బహువచనమున వువర్ణము వికల్పముగా వచ్చును.

ఉదా : ధేనువులు — ధేనులు ఇట్లే తరు, దారు, వస్తు మొ

౪౪. రాహ్వాదులకు ప్రథమైక వచనమున వు ప్రత్యయమును తక్కిన వచనములందెల్ల వు వర్ణమును వికల్పముగా వచ్చును.

ఉదా : రాహువు-రాహు. రాహువులు-రాహులు.

ఇట్లె : బాహు, కేతు, బిందు మొదలైనవి.

౪౫. ధర్మాదులకు వు వర్ణము వికల్పముగా వచ్చును. అగుచో తుది అ కారము ఉ కారమగును.

ఉదా ; ధర్ముపు - ధర్మము.

ఇట్లె : కర్మువు - వర్మువు మొ.

అట్టివానికి సప్తమిలో 'అందు-నన్' విభక్తులు వచ్చు.

ధర్మవందు - ధర్మువునందు — అని రూపము లగును.

౪౬. వు ప్రత్యయము రాని వు కారాంతములు కొన్ని: కొడుకు-చెఱువు. (దీనిలోని వు సహజము.)

ఉదా : కొడుకు — కొడుకులు. చెఱువు — చెఱువులు.

(అ) సప్తమిలో 'కొడుకునందు' అని యగును.

(ఆ) చెఱువు జడవాచకము గావున సప్తమిలో నన్ కూడ వచ్చును. చెఱువునందు- చెఱువునన్.

రాజు, రౌతు, పోతు, బంధువు మొదలైనవి కొడుకు శబ్దమువలె నగును. కొలువు, గొడుగు, తలుపు, ఱెల్లు మొదలైనవి చెరువు శబ్దము వలె నగును.

౪౭. మద్యార్థకమైన కల్లు-నిమ్నార్థకమైన పల్లు శబ్దములు చెఱువు శబ్దమువలె నగును.

౪౮. తెలుఁగులో కొన్నిపదముల నడుమ నుండెడి అ-ఇ-ఉ వర్ణములు బహుళముగా లోపించును.

ఉదా : మొలక - మొల్క, కలికి - కల్కి, చిలుక చిల్క,

ఇట్లె ఉంగరము, కలిమి, కోరికి, కూరిమి, పేరిమి, కాలువ, అడుగు, తూరుపు, ఇరువురు, కపురము మొ.

మునగ, పొలము, చిటిక, ఇటిక మొదలైన వానిలో లోపమురాదు.

౪౯. హల్సంయోగమున శకటరేఫ సాధు రేఫ మగును.

ఉదా : చెఱువు - చెర్వు (బండి ఱ మీఁది ఉ పైసూత్రమున లోపింపగా వ కారముతోఁ గూడినదిగావున రేఫమే వచ్చినది )

౫౦. కొన్ని తెలుఁగుపదముల కడపటి ద్విత్వహల్లునకు లోపము బహుళముగా నగును.

ఉదా : నన్ను — నను, నిన్ను - నిను, కన్ను - కను మొ.

౫౧. అచ్చుపరమైనప్పుడు ద్విత్వ లోపమురాదు.

ఉదా : నన్ను+అడిగెను=నన్నగెడిను (ననడిగెను. అనికాదు)

పన్ను, పిల్లి, చెట్టు, హెచ్చు, మెప్పు మొదలగు పెక్కు శబ్దములకు ద్విత్వము లోపింపదు.

౫౨. బహువచనములో కొన్ని పదములు వివిధ రూపములుగా మాఱును. ండ్రు - ండ్లు - డులు - లులు - రులు - ఱులు- ల్లులు - లు అనువానికి 'ళ్లు' బహుళముగా వచ్చును.

ఉదా : ఒక్కండ్రు - ఒక్కళ్ళు. ఇట్లె గూండ్లు - గూళ్ళు మొ.

౫౩. లు - ల పరమైనప్పుడు ట డ ర ల అను హల్లుల మీఁది ఉకారము బహుళముగా లోపించును.

ఉదా : పాటులు-పాట్లు, గిండులు-గిండ్లు, పేరులు-పేర్లు మొ.

౫౪. ల-లు వర్ణముతోఁ గలిసినపుడు, ఉకారముతో వ్యవధానమున్న ర-ల-ఱ అను హల్లులకు ళ కారము బహుళముగా వచ్చును.

ఉదా : గోరు+లు = గోర్లు-గోరులు = గోళ్ళు, గోళులు మొ.

గమనిక : 'వచనము' అను శీర్షిక చివరి పట్టికను పరిశీలింపవలెను.

## స్త్రీ లింగములు - స్త్రీసమములు

౫౫. సంస్కృత దీర్ఘాంతములును, నవలాదులును బహుళముగా హ్రస్వాంతము లగును.

ఉదా : సీతా--సీత. ఇట్లే లక్ష్మి, వధూ, సేనానీ మొ. (అచ్చ తెలుఁగులో : నవలా—నవల=స్త్రీ.)

ఇట్లే మేజా, లకోరీ, పల్లకీ, దుప్పటీ తంబుజా మొ.

౫౬. ఏకస్వర పదములయు, మత్తా,-కిటికీ మొదలైన కొన్ని శబ్దములయు దీర్ఘము హ్రస్వము కాదు.

ఉదా :- శ్రీ-హ్రీ-స్త్రీ-జ్యా—మా మొ
మత్తా—కిటికీ—అహో—సర్వదా—సదా మొ.

౫౭. భూ—హృత్-దివ్-కద్రూ—నౌ శబ్దములకు క్రమముగా భువి-హృది-దివి-కద్రువు-నావ ఆదేశము లగును. అవి స్త్రీసమము లగును.

౫౮. రై -గ్లౌ లలో అచ్చునకు ఓకారము వైకల్పికము.
ఉదా :—రై—రో, గ్లౌ—గ్లో

౫౯. అప్సరశ్శబ్దము ద్వితీయాంతరూపము ప్రాతిపదికము. ఇది స్త్రీ సమము, తుది మకారము లోపించును.

ఉదా :— అప్సరస—అప్సరసలు. ఇట్లె అన్యరూపములు,

౬౦. అశ్వత్థామాదులు న లోపమున ప్రాతిపదిక లగును. ఇవి స్త్రీ సమములు.

ఉదా :. అశ్వత్థామ, ఇట్లే కృష్ణవర్మ-యువ-యజ్వ-శూలి-గుణి-భాగ్యశాలి మొ.

గమనిక : స్త్రీ సమయములలో అ-ఆ-ఎ-ఒ తుదఁగలవి సీత-అయ్య శబ్దములవలెను, ఇ-ఈ-ఐ తుదఁ గలవి హరి-తల్లి శబ్దముల వలెను, ఉకారము తుదఁగలవి మహద్వాచకములు కొడుకు శబ్దమువలెను అమహద్వాచకములు చెఱువు శబ్దమువలెను రూపములను పొందును.

ఉ౧. ఇకారమునకు బహువచనము పరమైనపుడు ఉకారము వచ్చును.

ఉదా : (ప్ర. వి.) హరి-హరులు, తల్లి-తల్లులు.

ఉ౨. బహువచనము పరమగునపుడు అచ్చతెలుఁగు శబ్దములో తుది ఇ కారమునకు వెనుక నుండెడి ఇ కారమునకు ఉ కారము వచ్చును.

ఉదా : కలికి + లు=కలుకులు.

ఇట్లే : ములికి. గెలిమి, బలిమి, కలిమి, మానిసి, విడిది.

ఉ౩. (అ) రి లి డి వర్ణముల వెనుక నున్న ఇ కారమునకు ఉ కారము రాదు.

ఉదా : పందిరి + లు = (పందిరులు) పందిళ్లు.

ఇట్లే : గుప్పిలి, మామిడి. పిడికిలి, రాపిడి మొ.

(ఆ) రెండక్షరముల పదములలోను మొదటి యక్షరము మీఁది ఇ కారమునకు ఉ కారము రాదు.

ఉదా : బిగి—బిగులు.

ఇట్లే : జిగి, నిసి, గిరి, కిరి మొ.

ఉ౪. సంబోధనమునందు కొన్నికోట్ల స్త్రీ సమములకు కాన శబ్దము అనుప్రయుక్త మగును.

ఉదా : నా యయ్య కాన—నా తల్లి కాన—నా సామి కాన మొ

## సర్వనామముల విశేషరూపములు

సర్వాదులు ము ప్రత్యయముచేరి సర్వము, విశ్వము రూపముల నొందును. అట్టివి సాధారణములే. మార్పు లెక్కువ వచ్చునవి కొన్ని యిటఁ జూపఁబడును. సర్వనామములకు సంబోధన ప్రథమ లేదు.

ఒకఁడు—ఒకరు, ఒకనిని.

౭౫. ఇకారముమీఁద ను కున్ విభక్తుల ఉ కారమునకు ఇ కారము ఇచ్చును.

ఒకరు+ను=ఒకరుని అనిరాగా

౭౬. వారు మొదలగు డు మంతముల బహువచన రూపములకు ద్వితీయాది విభక్తులు పరమగునపుడు ఇ కారము బహుళముగా వచ్చును.

ఉదా : (ఒకరు+ని=ఉ కారము ఇ కారమై) ఒకరిని,

ఇట్లే : (వారు+ను=) వారిని, పీరిని, వారిచేత, వీరిచేత మొ.

వాండ్రను—వారలను మొదలైనచోట్ల (బహుళమనుటవలన) రాదని గుర్తింపవలెను.

౭౭. నీ, నా, తన శబ్దములకు ప్రథమమున నీవుమొదలైనవి ఆదేశము లగును.

ఉదా : నీ-(ఏ) నీవు (బ)° మీరు, మీరలు. నా-(ఏ) నేను (బ) మేము. తన (ఏ) తాను (బ) తాము-తారు.

(అ) మీరు నకు గౌరవార్థమున తాము, తమరు లగును.

౭౮. నీ,నా, తన శబ్దములకు ద్వితీయైకవచన బహువచనముల యందు క్రమముగా నిన్ను-మిమ్ము, నన్ను-మమ్ము తన్ను- తమ్ము అనునవి ఆదేశముగా వచ్చును.

౭౯. తృతీయాది బహువచనములందు వీనికి క్రమముగా మీ, మా, తమ అనునవి ఆదేశము లగును.

ఉదా : నీ చేత - మీచేత, నాచేత - మాచేత, తనచేత - తమచేత ఇట్లే తక్కిన రూపములు.

౨౦. అమహదర్థకములైన అది, ఇది, ఎది శబ్దముల ది వర్ణమునకు ప్రథమా బహువచనమున వి వర్ణము వచ్చును.

ఉదా : అది-అవి, ఇది-ఇవి, ఎది-ఎవి, ఏది-ఏవి.

౨౧. వీనికి ద్వితీయా ద్యేకవచనములందు దాని-దీని-దేని యనియు, బహువచనమున వాని-వీని-వేని అనియు క్రమముగా ఆదేశము లగును.

ఉదా :- (ఏ) దానిని (బ) వానిని. (ఏ) దీనిని (బ) వీనిని. (ఏ) దేనిని-(బ) వేనిని.

గమనిక : వాటిని-వీటిని మొదలగు విధముగాను కొందఱు ప్రయోగించుచున్నారు

౨౨. అమహదర్థకమైన ఒకడు శబ్దమునకు ద్వితీయా ద్యేకవచనములందు ఒకటి యాదేశమగును.

ఉదా : (ప్ర) ఒకఁడు (ద్వి) ఒకటిని మొ.
ఒకటి శబ్దమునకును రూపము లిట్లే యగును.

౨౩. అది-ఇది-ఎది శబ్దములకు మహత్యర్థమున ద్వితీయాద్యేకవచనములందు దాని దీని-దేని యగును.

ఉదా :- ఆమె - దానిని, ఈమె - దీనిని, ఎవతె - దేనిని.
(బహు) వారిని, వీరిని, ఎవరిని మొ.

౨౪. వారు, వీరు పదములపై మరల లు-ల వర్ణములు చేరుటయుఁగలదు. అపుడు వెనుకనున్న ఉ కారము అకారమగును,

ఉదా : వారు+లు=వారలు, వీరు+లు=వీరలు. వారలను - వీరలను మొదలైనవి.

౨౫. మన శబ్దమునకు ద్వితీయావిభక్తి పరమగునపుడు ల వర్ణము నిత్యముగా ఆగమ మగును.

ఉదా : (ప్ర) మనము (ద్వి) మనలను (తృ) మనచేత మొ.

౨౬. ఇద్దఱు-అందఱు మొదలైనవాని తుది ఉ కారమునకు ద్వితీయాది విభక్తులు పరమైనపుడు అ కారముగాని ఇ కారముగాని వచ్చును. ఇ కారము వచ్చినపుడు విభక్తి ఉ కారమునకు ఇ కారము వచ్చును.

ఉదా : (ప్ర) ఇద్దఱు, (ద్వి) ఇద్దఱను - ఇద్దఱిని, తక్కిన విభక్తులిట్లే. అందఱు, ఇరువురు, ముప్వురు, నలువురు, పెక్కురు, ఇందరు, ఎల్లరు మొదలైనవియు నిట్లే యగును.

## (ఈ) ఔపవిభక్తికములు

౧. ఇ-టి-ంటి-తి అనునవి ఔపవిభక్తికములు.

ప్రాతిపదికము మీఁద వచ్చునవి విభక్తులు; ఆ విభక్తులకు వెనుక దగ్గఱగా వచ్చి చేరునట్టి ఇ-టి-ంటి-తి అను వర్ణములు ఔప విభక్తికము లనఁబడును. ఇవి ద్వితీయాద్యేకవచనములు పరమగునపుడును, సమాసమునందును వచ్చును. ఆగమముగాఁగొన్నిటను ఆదేశముగా మఱికొన్నింటను వచ్చును.

### (ఇ)

౨. కాలు మొదలైన లు కార మంతమందు గలవాని తుది యచ్చునకు ఇ వర్ణము వచ్చును.

ఉదా : (ప్ర) కాలు-(ద్వి) కాలిని, కాలితో, కాలిక్రింద (సమా)

ఇట్లు ఆలు, ఒదలు, కోడలు, చదలు, చూలు, చెల్లెలు, నూలు, పాలు (భాగము అను అర్థము) మఱదలు, మొదలు, మోకాలు, వ్రేలు మొ.

౩. చేను మొదలగు ను వర్ణాంతపదముల తుది యచ్చునకు ఇ వర్ణము వచ్చును. నడుము శబ్దమునకును ఇట్లే.

ఉదా : చేవిని- చేనిచెంత.

కలను, కొలను, గూను, పేను, మ్రాను, మేను, వలను మొదలైనవాని కిట్లే

౪. ఔపవిభక్తికమైన ఇ వర్ణ మాదేశమగుచో ఒక్కొక్క యెడ పూర్వమందున్న ఉ కారము ఇ కార మగును.

ఉదా : (నడుము) నడిమికి-నడిమివాఁడు.

౫. ఊరు మొదలైన కొన్ని రు కారాంతములకు ఇ వర్ణము వచ్చును.

ఉదా : ఊరిని-ఊరివారు.

పేరు, తేరు. కూఁతురు. పోరు, నగరు మొదలైన వానిలో నిత్యముగాను, నోరు-నీరు-గోరు మున్నగువానిలో వికల్పముగాను ఈ కార్యము వచ్చును. నోరిని- (పక్షమున టి వచ్చి) నోటిని.

౬. అక్కడ మొదలగు వానికి ఇ వర్ణము వచ్చును.

ఉదా : అక్కడికి-అక్కడివారు.

ఇక్కడ-అక్కడ-ఎక్కడ-చోటు-మాటు-ముందఱ-మీఁదు-క్రింది-పిఱుఁదు-పిమ్మట మొదలైన విట్టివే.

(టి)

౧. రోఁకలి మొదలైనవాని తుది వర్ణమునకు టి ఆదేశ మగును.

ఉదా : (రోఁకలి) రోఁకటిని-రోఁకటిపాట

అంగిలి - ఆఁకలి - కొడవలి - గుప్పిలి - కౌఁగిలి-గొడ్డలి-చెక్కిలి-తిరుగలి-దోసిలి-నాగలి- పిడికిలి - పుక్కిలి - మూంగిలి వాకిలి-పందిలి మొదలైన విట్లే.

గొడ్డలి మొదలైన కొన్నింటికి 'ంటి'వర్ణముకూడవచ్చు గొడ్డటిని-గొడ్డంటిని.

౮. త్రాడు మొదలైన వానికి టి వర్ణమాదేశ మగును.

ఉదా : త్రాటిని-త్రాటికట్టు.

పీడు-పాడు-కాడు-ఏకు-జోడు-ఓడు-బీడు-నాఁడు - గూఁడు - పోడు - కోడు - పెరడు - మెదడు - పురుడు - తవుడు - నిరుడు- మూఁకుడు - తూడు - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు మొదలైన విట్లే యగును.

౯. నీరు, నోరు, గోరు అనువానికి వికల్పముగా టి వచ్చును.

ఉదా : నీటిని-నోటిని-గోటిని మొ (పక్షమున) నీరిని-నోరిని-గోరిని.

౧౦. ఎసరు మొదలైన వానికి టి వర్ణము వచ్చును.

ఉదా : ఎసటిని - ఎసటినీరు.

నెత్తురు - నుదురు - ఎదురు మొదలైన విట్లే.

౧౧. క్రిందు మొదలైన వానికి టి వర్ణము ఆగమముగా వచ్చును. అట్టియెడ ముందున్న ఉ కారము తఱుచుగా అకారమగును.

ఉదా : (క్రిందు) క్రిందటికి - క్రిందటియేడు.

ఇట్లే మీఁదు - ముంటు - మాపు - రేపు - సేపు - మునుపు - నిన్న - మొన్న - అంత - ఎంత - తొలుత - వెనుక - పిదప మొదలైనవి.

౧౨. 'ఏమి' కి 'టి' వర్ణము ఆదేశముగాను ఆగమముగాను వచ్చును.

ఉదా : ఏమిటికి - ఏటికి - ఏటి మాటలు.

౧౩. అన్ని మొదలైన వానికి టి వికల్పముగా వచ్చును.

ఉదా : అన్నిటికి (పక్షమున ంటి వచ్చి) అన్నింటిని.

కొన్ని, ఎన్ని మొదలైన విట్లే.

## (ంటి)

౧౪. విల్లు మొదలగు వానికి ంటి ఆదేశమగును.

ఉదా : (విల్లు) వింటిని - వింటికొన.

ఇల్లు, ముల్లు, పల్లు, (దంతము,) కల్లు (చక్రము-రాయి) బళ్ల మొదలైనవి యిట్టివే.

౧౫. కన్ను మొదలైన వానికి ంటి ఆదేశమగును.

ఉదా : కంటిని - కంటిపాప.

ఇట్లే మన్ను, జున్ను, మిన్ను, విన్ను మొదలగునవి.

## (తి)

౧౬. అట్టు మొదలగువానికి తి వర్ణ మాదేశమగును. ద్విత్వము లోపించి ఉ కారమునకు ఇ కారము వచ్చును.

ఉదా : అటితిని - అటితికి.

కట్టు గొట్టు, మిట్టు పట్టు, కొట్టు, కుట్టు మొదలైనవిట్లే.
సంయోగమున శకట రేఫ, సాధురేఫ మగును : గొర్తిని.

౧౭. చేయి మొదలగు వానికి ప్రథమా బహువచనాదులు పరమగునపుడును సమాసమునందును తి వర్ణము వచ్చును.

ఉదా : చేతులు - చేతిని, చేతికట్టు.

ఇట్లే నూయి, గోయి, వాయి, రాయి, మొ.

## (టి-ఇటి-ఇంటి)

౧౮. ఒండు, రెండు మొదలగు సంఖ్యావాచకములకు టి-ఇటి-ఇంటి ప్రయోగములనుబట్టి యగును.

ఉదా : ఒంటిని, ఒకంటిని, రెంటిని, నాలుగిటిని, నాలుగింటిని, అయిదిటిని, ఏడింటిని, పదింటిని, నూటిని మొదలగునవి.

---

# ౩. కారకములు

పదములు క్రియలతోఁ జేరి సంపూర్ణార్థము నిచ్చును. దీనికి వాక్యార్థము–సముదాయార్థము ననియు వ్యవహారము గలదు. పదములు వానిపై వచ్చు విభక్తుల ద్వారమునఁ గ్రియలతో నన్వయించును. ఆయా విభక్తు లేయర్థమున వచ్చునో తెలుపునదియే కారకము క్రియలతో నన్వయించునది కారకమని భావము.

౧. కారకము లాఱువిధములు :

కర్తృ కారకము, కర్మ కారకము, కరణ కారకము, సంప్రదాన కారకము, అధికరణ కారకము.

## కర్తృ కారకము

౨. ప్రాతిపదికార్థమునను, సంబోధనార్థమునను ప్రథమ వచ్చును.

ఉదా : రాముఁడు, గురువు, వృక్షము (ప్రాతిపదికార్థము)
ఓ రాముఁడా ! (సంబోధనము)

రాముఁడు–గురువు–వృక్షము అనుచోట్లఁ గనఁబడునట్టి డు–వు–ము అను విభక్తులు రామాది మూల పదములకు (ఇవియే ప్రాతిపదికములు) ఏ యర్థముగలదో ఆ యర్థమునందే వచ్చినవి. 'రాముఁడు పాఠమును చదివెను.' అను వాక్యములో 'ఎవఁడు చదివెను?' అను ప్రశ్న రాఁగా రాముడు అని కదా సమాధానము. చదువుట యను పని చేసినవాఁడు రాముఁడు, కర్త. కావున దీనిని కర్తృకారక మందురు. ఇట్లే తక్కినవి తెలియ నగును.

౩. క్రియా పదముచేఁ జెప్పఁబడిన కర్మార్థకమైనను దానికి ప్రథమ వచ్చును.

ఉదా : రామునిచే రావణుఁడు చంపఁబడెను.

ఇట 'ఎవఁడు చంపఁబడెను?' అను ప్రశ్నకు రావణుఁడు అని బదులు వచ్చును. కావున అది క్రియతోఁ జెప్పఁబడినది. వచ్చుటలోఁ గర్మయైనను దానికంటె ప్రథమ వచ్చినది.

౪. ప్రథమావిభక్తి ప్రత్యయములు కనఁబడని హరి, సీత మొదలైన పదములు కర్తృవాచకములే.

ఉదా : సీత వచ్చెను.
అమ్మ, అన్న, కొడుకు మొ.

౫. విశేష్యానుగుణముగా విశేషణములకును, సర్వనామముల కును ప్రథమ వచ్చును.

ఉదా . మేఘశ్యాముఁడు రాముఁడు.
భీముఁడు బలశాలి. అతఁడు బకాసురునిఁ జంపెను.

తఱచుగా విశేషణములు "అగు, అయిన, అయినట్టి" అను వానితోఁ గూడి వచ్చును.

౬. పరిమాణార్థమునఁ బ్రథమ వచ్చును.

ఉదా : తూమెఁడు బియ్యము. ఈ జొన్నలు మూఁడు కుంచములు.

౭. విశేష్యము లన్యవిభక్తులలో నున్నను గొన్నింట విశేషణములు ప్రథమాంతము లగును.

ఉదా : రఘుకులాలంకారుఁడు రామునకు, లోకకంటకుఁడు రావణునకు యుద్ధమయ్యెను.

౮. జడవాచకముల కర్మపదములకు ప్రథమ వచ్చును.

ఉదా : లక్ష్మి తిలకము దిద్దెను. అన్న పుస్తకము తెచ్చెను,

౯. కొన్ని యమహద్వాచకములపై నున్న యితర విభక్తులకు బదులుగాఁ బ్రథమా విభక్తి కూడ వచ్చును.

ఉదా : కాఁపు బండి యెక్కెను. (బండిపై) రాజు పేరోలగ ముండెను. (పేరోలగమందు) జానకి జలకమాడెను. ఊరేగెను, తీర్థమాడెను, బండి దిగెను (బండినుండి) మొ

౧౦. కాలవాచక మార్గవాచకములకు సప్తమ్యర్థమున ప్రథమ కూడ వచ్చును.

ఉదా : వాడు నిన్న వచ్చెను రామశాస్త్రి వ్యాకరణమ పదేండ్లు పఠించెను. రాత్రి నాటకము చూచితిని.

## కర్మ కారకము

౧౧. క్రియా ఫలాశ్రయము కర్మ. క్రియతో చెప్పఁబడని యట్టి కర్మకు ద్వితీయ యగు.

క్రియకు వ్యాపారము, ఫలము అనునవి రెండర్థములున్నవి. వీనిలో వ్యాపారాశ్రయము కర్త. దానికి ప్రథమ వచ్చినదికదా. ఫలాశ్రయమైన కర్మకు దీనిచే ద్వితీయ వచ్చును.

ఉదా : శ్రీకృష్ణుఁడు వేణువు నూదెను. ఇట్లే: నలుఁడు దమ యంతిని వరించెను మొ.

౧౨. కొన్ని ధాతువులకు రెండేసి కర్మపదము లుండును. రెండింటికిని ద్వితీయ వచ్చును.

ఉదా : వామనుఁడు బలిని భూమిని యాచించెను.
ఇట్లే కోరు, పితుకు, వేడు మొ.

౧౩. ఉద్దేశార్థములో ద్వితీయమీఁద కూర్చి-గుఱించి యగును.

ఉదా : నీవు దేనినిగూర్చి యాలోచించుచున్నావు? నీ ఉద్యోగ మును గుఱించియే యధికారితో మాట్లాడినాను.

## కరణ కారకము

౧౪. కర్తృకరణార్థములందు తృతీయ వచ్చును.

క్రియచేఁ జెప్పఁబడిన కర్తృవాచకమునకును, ఒక పనిని సాధించు టయందు సాధనమైన కరణమునకును తృతీయ వచ్చును. ఇదియే కరణ కారకము.

ఉదా : (అ) బాలునిచేత పాఠము చదువఁబడెను. (కర్తృ)

ఇట చదివినది బాలుఁడు- కర్త, క్రియచేఁ జెప్పఁబటలేదు. క్రియచే జెప్పఁబడినది పాఠము కాని బాలుఁడు కాఁడు. కావున తృతీయ వచ్చినది.

ఉదా :- (ఆ) ఉపాధ్యాయుడు కలముచే వ్రాయుచున్నాఁడు.

వ్రాయుటకు సాధనమైనది కలము కావున తృతీయ వచ్చినది. ఈ యర్థమున 'తో' కూడ ప్రయోగింపబడును.

౧౫. హేతువునకు చేత వర్ణకమగును.

ఉదా : విద్యచేత జ్ఞానము కలుగును.

ఈ యర్థమున 'వలనన్' వర్ణముకూడ పక్షమున వచ్చును. విద్య వలన వినయము-వినయము వలన పాత్రత మొ.

౧౬. సహార్థమున 'తోడన్' వచ్చును.

గురువు శిష్యులతోడ వచ్చెను.

౧౭. తుల్యార్థక పదములు పరమైనపుడు తోడన్ బహుళముగా వచ్చును.

ఈ కవి కాళిదాసునితో సమానుఁడు.

(పక్షమున షష్ఠి) ఈ మంత్రి బుద్ధిని బృహస్పతికి ఉద్ది.

౧౮. జడవాచకముల ద్వితీయాది రూపముల మీఁద చేతన్ విభక్త్యర్థమున 'చేసి' యనునదియుఁ గన్పట్టును.

ఉదా : భక్తిం జేసి ఈశ్వరానుగ్రహము కలిగెను.

౧౯. జడవాచకముల మీఁద తోడఁవిభక్తికి బదులుగా మైన్, మెయిన్ అనునవి చేరుటయుఁగన్పట్టును.

ఉదా : దశరథుఁడు భక్తిమెయి గాథేయుఁ బూజించెను

౨౦. విద్యాభ్యాసము తోఁచునపుడు గురువాచక పదమునకు పంచమ్యర్థమున 'తోన్' వచ్చును.

ఉదా : వ్యాసునితో జైమిని శాస్త్రంబులు చదివెను.

## సంప్రదాన కారకము

౨౧. సంప్రదానమున చతుర్థి వచ్చును.

దానక్రియకు ఉద్దేశమైన దానికి చతుర్థి వచ్చును. ఈ వస్తువు తిరిగి నాకు రావలెనను ప్రత్యాశ లేకుండఁగా అచ్చముగా ఇచ్చి వేయుట సంప్రదానము.

ఉదా : రాజు బ్రాహ్మణుని కొఱకు గోవు నిచ్చెను.

(సంప్రదానము కాకపోయిన) నరసయ్య ముచ్చెవానికి చెప్పు లిచ్చెను.

౨౨. నిమిత్తార్థమున చతుర్థ్యర్థమందు కోసము - కోసరము, పొంటెన్ అనునవి వచ్చును.

ఉదా : నీ కోసము వచ్చినాను. ఇట్లే నీ కోసరము - లోక హితము పొంటెన్.

౨౩. తాదర్థ్యమున చతుర్థియగు.

ఉదా : దానికొఱకు అను నర్థమున చతుర్థి వచ్చును.

భక్తుఁడు ముక్తి కొఱకు హరిని సేవించుచున్నాడు. ఈ బంగారము చంద్రహారము కొఱకు కొన్నాను.

## అపాదాన కారకము

౨౪. విశ్లేషమున అవధియైన దానికి అపాదాన మని పేరు. అట్టి దానికి పంచమి వచ్చును.

ఉదా : రాజు రాజ్యమువలన భ్రష్టుఁడయ్యెను.

ఇట రాజు, రాజ్యములకు ఎడబాటు కలిగినది. రాజు తొలఁగినాఁడు. రాజ్యము నిల్చియే యున్నది. కావున దానిపై పంచమి వచ్చినది.

౨౫. భయార్థకములు - రక్షణార్థకములు నయిన క్రియల ప్రయోగమున భయహేతువైన వానిపై పంచమి వచ్చును.

ఉదా : బాటసారులు దొంగలవలన భయపడిరి. రాజు జనులను దుష్టులవలనఁ గాపాడెను.

౨౬. దప్పిపోవు - పరాకుపడు - కై కొను - దాఁగు - విను- నేర్చు - పుట్టు - మొదలగువాని ప్రయోగమున పంచమి వచ్చును.

ఉదా : ౧. బాలుఁడు చదువువలన దప్పిపోయెను.
౨. గర్వితుఁడు ధర్మమువలన పరాకు పడును.
౩. యతి శిష్యులవలన భిక్ష గైకొనెను.
౪. దొంగ రక్షకభటుని వలన దాఁగెను.
౫. ఋషులు సూతుని వలనఁ బురాణ కథలు వినిరి.
౬. అర్జునుఁడు ద్రోణాచార్యునివలన విలువిద్య నేర్చెను.
౭. బ్రహ్మవలన ప్రజలు పుట్టిరి.

౨౭. విరమించు - ఏవగించు - వారించు మొదలగువాని ప్రయోగమున పంచమి వచ్చును.

ఉదా : ౧. జ్ఞాని లౌకిక భోగములవలన విరమించును.
౨. మహాత్ముఁడు హింసవలన ఏవగించెను.
౩. గురువు శిష్యుని చెడుత్రోవ వలన వారించెను.

౨౮. విశ్లేషార్థమునను, కాలాధ్వ పరిమాణములందును ద్వితీయాదులపై 'ఉండి-ఉంచి' అనునవి బహుళముగా వచ్చును.

ఉదా : ౧. లంచగొండి పదవినుండి తొలగింపఁబడెను. | విశ్లేషా
౨. వాఁడు గుఱ్ఱమునుండి పడెను. | ర్థము.
౩. చైత్రమునుండి క్రొత్త సంవత్సర మారంభింగును. (కాలార్థము)
౪. గోదావరి నుండి మాగ్రామము రెండు క్రోసులు. (అధ్వము)

ఇక్లే నుంచి' యు నగును.

మామ యూరినుంచి వచ్చెను

(సప్తమిపై ఉండి) ఉదా వృక్షమున నుంచి పండు పడెను

(పంచమిపై ఉండి) ఉదా హిమగిరి వలన నుండి గంగ ఉద్భవించెను

౨౯. అన్యపూర్వాది శబ్దముల సంబంధమున కంటె ప్రాయి కముగా వచ్చును.

ఉదా ౧ హరికంటె నన్యుఁడు రక్షకుఁడు లేడు

౨ నలుఁడు ధర్మరాజుకంటెఁ బూజ్యుడు.

ఇతరము-పెఱ - వేఱు - దిగ్వాచకములు - నిర్ధారణ - దూర-సమీపార్థములకు నిక్లే కంటె వచ్చును.

౩౦. కొన్ని విభక్తులపై పంచమ్యర్థమున పట్టి వచ్చును.

ఉదా ౧ భగీరథుఁడు పెద్దకాలమునంబట్టి తపమాచరించు చుండెను

ఉదా ౨ తా మధ్యక్షత వహించుటంబట్టి సభ చక్కఁగా జరిగినది

౩ ధనముంబట్టి పలుకుబడి

## షష్ఠీ విభక్తి

విభక్తులలో ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థి పంచమి సప్తములకే కారక సంజ్ఞకలదు షష్ఠికిలేదు అయినను ఇట షష్ఠీవిభక్త్యర్థము లెట్టివో తెల్పఁబడు చున్నవి

౩౧. సంబంధార్థమున యొక్క కిన్ కున్ వచ్చును.

ఉదా వాఁడు భూపతి యొక్క సేవకుఁడు వాఁడు భూపతికి సేవకుఁడు వానరులకు సుగ్రీవుఁడు రాజు

౩౨. దిగ్వాచకములు, దూర-సమీపార్థములు పరమైనప్పుడు కిన్, కున్ వచ్చును

ఉదా : విజయవాడకు దక్షిణమునఁ గృష్ణ యున్నది.
బడికి దగ్గఱగాఁ దోఁట యున్నది.
కాలువకును మాయింటికిని దూర మెక్కువ.

౩౩. నిర్ధారణార్థమున షష్ఠికి 'లోన్ - లోపలన్' 'అందు' వచ్చును.

ఉదా : కవులలో కాళిదాసు శ్రేష్ఠుఁడు.
ధర్మముల లోపల యహింస మిన్నయైనది.
పర్వతములయందు మేరువు మేటి

## అధికరణ కారకము

౩౪. అధికరణమున సప్తమి వచ్చును.

ఒక వస్తువునకుఁగాని గుణమునకుఁగాని ఆధారమైనది అధికరణ మనఁబడును. అట్టియెడ సప్తమి వచ్చును.

అధికరణము మూఁడు విధములు:౧. ఔపశ్లేషికము ౨. వైషయికము ౩. అభివ్యాపకము.

ఉదా : రాముఁడు గృహమునం దున్నాఁడు. (ఔప)
జ్ఞానికి మోక్షమం దిచ్ఛ కలదు. (వైష)
భగవంతుఁ డన్నిటియందును వ్యాపించియున్నాడు. (అభి)

౩౫. దూర—సమీపార్థములకును సప్తమి వచ్చును.

ఉదా : మా పొలము గ్రామమునకు దూరమునందున్నది.
బడికి సమీపమునందే వైద్యశాల గలదు.

౩౬. ఉ కారాంతములైన జడవాచకముల మీఁదఁ దృతీయకు బదులు 'నన్' విభక్తియు వచ్చును.

ఉదా : సాధనమునఁ బనులు సమకూరు చుండును.
వీరుఁడు ఖడ్గమునఁ గొట్టెను.

౩౭. భావార్థకాదియోగమునఁ గర్తకుఁ బ్రథమ యగును.

ఉదా : రాముఁడు వచ్చుట.

రాముఁడు రాఁగా మునులు సంతసిల్లిరి.

బ్రహ్మదేవుఁడు వ్రాసిన వ్రాఁత తప్పదు.

౩౮. నీవు, మీరు అనువాని విశేషణములకు క్రమముగా వు-రు అనునవియు, నేను, మేము అనువాని విశేషణములకు ను - ము అనునవియు నేకవచన బహువచనములందగును. పూర్వమునందున్న ఉ కారము అ కారమగును.

ఉదా : నీవు ధన్యుఁడవు-మీరు ధన్యులరు.

నేను ధన్యుఁడను-మేము ధన్యులము.

౩౯ ఇ కారాంత శబ్దములమీఁది ను—వు వరముల ఉ కారము ఇ కారమగును.

ఉదా : నీవు ధైర్యశాలివి-నేను సుకృతిని.

౪౦. అది శబ్దమునకు 'వు-ను' లు పరంబులగునపుడును, సంబోధనమునను 'దాన' అదేశమగును.

ఉదా : నీవు చిన్నదానవు-నేను చిన్నదానను.

ఓ చిన్నదాన మొ.

౪౧. జడవాచకములైన విశేషణముల బహువచనమునకు ఏకవచనము బహుళముగా వచ్చును.

ఉదా : పావనములైన శిరోజములు-పావనమైన శిరోజములు.

మాట లింపయ్యె-మాట లింపులయ్యె,

——

# ౪. అవ్యయములు

౧. లింగ విభక్తి వచన శూన్య మవ్యయము.

సాధారణముగాఁ బదములకు లింగము - విభక్తి - వచనము నుండును. కాని యవి లేనివికూడ కొన్ని 'చూచి' 'ఔరా' 'సదా' వంటివి భాషలోఁ గన్పడు చున్నవి. అట్టి వానికే అవ్యయములని పేరు. 'విభక్త్యంత శబ్దములవలె వివిధ రూపములను పొందనివి" యను నర్థమునిచ్చు నీ యవ్యయ పదము సార్థకము.

## ౨. ప్రతిపదోక్తములు, లాక్షణికములు నని అవ్యయములు రెండు విధములు

పుట్టుకతోనే లింగాదులు లేనివి, వాడుకలో లింగాదులను విడిచి యితరార్థములందు స్థిరపడినవియును ప్రతిపదోక్తములు.

ధాతువులనుండి పుట్టిన యవ్యయములు లాక్షణికములు.

సంస్కృతావ్యయములు :

## ౩. ఈ పట్టికలోని సంస్కృతావ్యయములు తెలుఁగులోఁ బ్రత్యేకముగాఁ బ్రయోగింపఁ బడు చున్నవి.

స్వస్తి, సదా, వృథా, అథవా, సర్వత్ర, ప్రతి.

ప్రతి యనునది తెలుఁగు పదములతోఁ గూడియు, స్వతంత్రముగాను ప్రయోగింపఁ బడుచున్నది.

ఉదా : ౧, ప్రతివాఁడు ౨. నీ ప్రతి యీ లోకమున లేఁడు. (సాటి) ౩. నీ ప్రతిగ నేను పోయెదను. (బదులు) ౪. ఇది యపూర్వగ్రంథము. దీనికి ప్రతి యొక్కటి వ్రాయింపవలెను. (ప్రతిబింబ పుత్రిక)

## ప్రతిపదోక్తములు

౧. అ-ఆ నుండి వాడుఁగో వఱకుఁ గలవి ప్రతిపదోక్తావ్యయములు. ఇవి కేవల దేశ్యములు. వీనికిఁ బదత్వ మాదిష్ట మగుట ప్రయోగార ములని గుర్తించునది.

అ, ఆ, ఇ, ఈ, అఁ, ఊ, ఎ, ఏ, ఓ, అన్నా, అమ్మమ్మా, అమ్కక్క, అయ్యో, అబ్బో, అబ్బే, ఆయలే, ఆహా. అకటా, అఁట. అటె, అరే, అట్లు ఇట్లు, ఎట్లు, అటు, ఇటు, ఎటు, అంతన్, ఎట్టెట్టూ, ఇఁకన్, ఏని, అంది, ఏమి, ఏసి, ఉను, ఓయి, కావునన్, దాఁకన్, కాని, కరము, అనయము, కాఁబట్టి, కాఁబోలును, పోలెన్, వలెన్, బలెన్, ఔరా, కదా; మిక్కిలి, మఱి, ఊరక, మిన్నక, భళీ, ఇహిహీ, రే, రా, చెల్లరే, పదండి, బోరనస్, విదపన్, ఇంచుక, ఏల, ఒండెన్, ఒకో, మా, జే, సరి, సేనా, తలా, ను, వెంటన్. సెబాసు మొ.

కూర్చి, గుఱించి, మైన్, మెయిన్, చేసి, పొంటెన్, కోసము, కోసరము, ఉంచి, ఉండి, పట్టి మొ.

అపుడు, ఇపుడు, ఎపుడు, అందు, ఇందు, ఎందు, అట, ఇట, ఎట, ఎల్ల, ఆవల, ఈవల, మొ.

అదిగో, ఇదిగో, అఁడుగో, ఇఁడుగో, ఏఁడీ, ఏరీ, చాగా, కూడా, చూ, చుమీ, సుఁడీ, ఇంద, ఇందండి, వాఁడుగో మొ

౨. కొన్ని ప్రతిపదోక్తావ్యయములకు రూపాంతరములును గలవు.

ఉదా: అటులు, అట్టు, కద, కదా, ఔరా, అపురా, అక్కటా, అకటా, అకట, కటా, బాపురే, బాపు, పురే, ఏమి, ఏమీ, (ఏమి-ప్రశ్నార్థకము, ఏమీ-ఆశ్చర్యార్థకము)

౩. కాని దీర్ఘాంతమైనపుడు అంగీకారమును — వికల్పమును తెలుపును. హ్రస్వాంతమైనపుడు వికల్పమును మాత్రమే తెలుపును

ఉదా : కానీ రండు. నేను గానీ వాఁడు గానీ వత్తుము నీవు కాని వాఁడుకాని రండు.

౭. చాలా కూడా లకు అచ్చుపరమైనపుడు, 'ను' వచ్చును.

ఉదా : చాలా+ను=చాలాను, కూడా+ను.=కూడాను.

౮. మా అను నవ్యయము భళీ, మిక్కిలి, గొప్ప యను నర్థములను దెలుపును.

ఉదా : మామ యిచ్చెను మా యని మహి నుతింప.
మా మంచివాడవు-మాబాగు-ఇట్టివి.
(ఇది మహచ్ఛబ్దముయొక్క అపభ్రంశరూపము.)

౯. జే ఆశీర్వాద నమస్కారార్థకమైన యవ్యయము. దీని ఆమ్రేడిత రూపమే జే జే. ఇది జై యనియు అయినది. (జయశబ్ద వికృతియే జే)

౧౦. ఇంకన్-దాఁకన్ మొదలైనవి న లోపము, దీర్ఘము వచ్చి ఇంకా - దాఁకా - చూచినా అగును.

౧౧. సముచ్చయము లోపించి వెనుక అచ్చు దీర్ఘమగుటయు కలదు.

ఉదా : చల్లయు-చల్లా, అంతా ఇంతా మొ.
'చల్లా యంబలి ద్రావితిన్, మొదలైన ప్రయోగములు.

౧౨. క్త్వార్థకము మీఁది సముచ్చయము లోపించి పూర్వాచ్చు దీర్ఘమగుటయుఁ గొన్నింటఁ గన్పట్టును.

ఉదా : చూచియు + చూడక = చూచీ చూడక. నమ్మీ నమ్మక-వినీ వినక మొ.

౧౩. (అ) కూర్చి మొదలైనవి విభక్తి ప్రతిరూప కావ్యయములు ద్వితీయాది విభక్త్యర్థముల నిచ్చును.

(ఆ) అందు - ఇందు - ఎందు విభక్త్యంత ప్రతిరూపకావ్యయములు. వీనిపైఁ గొన్ని విభక్తులు వచ్చును.

ఉదా : అందుండి-అందువలన-అందులో మొ.

ఎల్ల-ఎల్లరు-ఎల్లరకున్ మొదలైన వానిలోని ఎల్ల కళయైన యవ్యయ మని గుర్తింపవలెను.

## లాక్షణికావ్యయములు

౧౪. ఇ వర్ణాంతమైన అసమాపక క్రియలును, అక అంతమందుఁ గల తద్వ్యతిరేక పదములును, చున్ అంతములగు ననియు, ఒక పనికి నిమిత్తమయిన వేరొక పనిని తెలుపు అను వర్ణాంతములును, కాలేచ్ఛాదుల దెలుపు పదములు పరమైనపుడువచ్చు అను ప్రత్యయాంతములును, కారణ వాచకములపై వచ్చు ఇనను ప్రత్యయాంతములును అవ్యయములు.

ఉదా : ౧. చదివి-చూచి ౨. చదవక-చూడక ౩. చదువుచున్-చూచుచున్ ౪. చదువన్-చూడన్ (కాలేచ్ఛాదులం దెలుపు పదములు పరమైనపుడు) ౫. చదివినన్-చూచినన్ ఇట్లే తక్కినవి.

౧౫. అయితే-ఉంటే మున్నైనవి నిపాతములు, అవ్యయములు

౧౬. అనంతరార్థమున క్రియలకు డున్ వచ్చి అవ్యయమగును

ఉదా : కోరుడున్-(కోరిన పిమ్మట అని యర్థము)

౧౭. డున్ పరమగునపుడు అగు నకు కావు అనియు, అను నకు అనవు-నావు లును వికల్పముగా వచ్చును.

ఉదా : అడుగున్-కావుడున్, అనుడున్-అనవుడున్-నావుడున్.

# ౫. క్రియాపదములు

౧. పనిని బోధించునది క్రియాపదము.

రాముఁడు నవ్వెను - ఈ వాక్యములోని మొదటిపదము రాముఁడను కర్తను చెప్పుచున్నది. రెండవ పద మాతఁడు చేసిన పనినిఁ దెలుపుచున్నది. ఇట్టి వానిని క్రియాపదము లందురు.

౨. క్రియా పదములలో మూలఖండమును ధాతు వందురు.

నవ్వెను అను పదములో రెండు భాగములున్నవి. నవ్వు ఒక భాగము ఎను రెండవ భాగము. నవ్వుచున్నాఁడు-నవ్వఁగలఁడు-నవ్వును మొదలైన వానిలో చున్నాఁడు. కలఁడు మొదలైనవి మాఱుచున్నను మొదటి భాగములో మార్పులేదు. కావున అది మూలము. దానిని ధాతు వందురు.

ఉదా : నవ్వు, చూచు, చదువు, విను మొ.

౩. ధాతువులు రెండు విధములు: సకర్మకము - అకర్మకము.

కర్మను కోరునది సకర్మము : తిను-చూచు మొ.

కర్మాపేక్షలేనిది అకర్మకము : నవ్వు-వచ్చు-పోవు మొ.

౪. కొన్ని ధాతువులు ద్వికర్మకములు.

వేడు-పితుకు మొదలయిన కొన్నింటికి రెండు కర్మపదము లుండును.

ఉదా : గొల్లవాఁడు ఆవును పాలను పితుకుచున్నాఁడు.
భిక్షుకుఁడు దాతను ధనమును యాచించుచున్నాఁడు.

౫. క్రియాపదములును మహదర్థకాది భేదములు గలవియే.

పురుషుఁడు కర్తయైన మహదర్థకక్రియ-స్త్రీయైన మహత్యర్థక క్రియ-పశు పక్షి జడాదులైన అమహదర్థకక్రియ యని తెలియనగును.

౬. క్రియావిభక్తులు సాధారణముగా అనుబంధము గలవి. రి వర్ణకము నిరనుబంధము.

౭. కర్తృత్వమునుబట్టి క్రియలు మూఁడు విధములు.

| | |
|---|---|
| తాను కర్తయైనపుడు | ఉత్తమ పురుష క్రియ |
| ఎదుటివాఁడు కర్తయైన | మధ్యమ పురుషక్రియ |
| అన్యుఁడు కర్తయైన | ప్రథమ పురుషక్రియ |

౮. పని జరుగు కాలమునుబట్టి క్రియ నాలుగు విధములు. ౧. భూతార్థకము, ౨. వర్తమానార్థకము ౩. భవిష్యదర్థకము ౪. తద్ధర్మాద్యర్థకము.

౯. అవి సమాపకములు, అసమాపకములు నని రెండు తీరులు.

ఉదా : (సమా) రాముఁడు వచ్చెను. (అసమా) రాముఁడు వచ్చి యజ్ఞమును కాపాడెను.

౧౦. సంస్కృతములైన కొన్ని నామములును, ధాతువులును, ఇంచు, ఇల్లు అనునవి చేరుటవలన తెలుఁగులో ధాతువు లగును.

కరుణించు. స్తుతించు, భజించు, రచించు, రంజిల్లు విలసిల్లు మొ.

౧౧. ధాతువు లన్నియు ఉ కారాంతములే.

వచ్చు, చూచు, నవ్వు నుతించు, పఠించు మున్నైనవి.

౧౨. ధాతువులు ఆత్మనే పదములనియు, పరస్మైపదము లనియు రెండు విధములు.

క్రియా ఫలము తనకుఁజెందిన ఆత్మనేపదము.

ఉదా : అతఁడు అన్నము వండుకొనుచున్నాఁడు (తనకొఱకు) క్రియాఫలము తనకును - ఇతరులకును కూడా చెందిన పరస్మైపదము.

ఉదా : అతఁడు అన్నము వండుచున్నాఁడు.

## భూతకాలము

వచ్చు ధాతువు-ప్రక్రియ (ఇట్లే తక్కినవి)

౧౩. భూతకాలమునందు ధాతువుపై, ప్రథమ పురుషైక వచనమున ఎను వచ్చును. బహువచనమున రి వచ్చును

వచ్చు+ఎను అనికాగా.

౧౪. భూతకాల క్రియావిభక్తులు పరమగునపుడు ధాతువు తుదియచ్చునకు 'ఇ' వర్ణక మాదేశ మగును.

వచ్చి+ఎను అయి-

౧౫. ఎకారాది ప్రత్యయములు పరమైనపుడు అన్వాది పద్వా దులకుఁదక్క తక్కిన ధాతువుల ఇ కారమునకు సంధి నిత్యము.

వచ్చి+ఎను=వచ్చెను. వచ్చి+రి=వచ్చిరి.

౧౬. భూతకాలమున అమహద్వాచకములందు ప్రథమ పురుషకు ఉభయ వచనములందును ఎను వచ్చును.

(ఆవు) వచ్చెను. (ఆవులు) వచ్చెను.

౧౭. భూతకాలమున మధ్యమ పురుషకు ఏకవచనమున తివి, బహువచనమున తిరి వచ్చును. ఉత్తమ పురుషకు తిని, తిమి వచ్చును.

వచ్చు+తివి=వచ్చితివి.
వచ్చు+తిరి=వచ్చితిరి.
వచ్చు+తిమి=వచ్చితిమి. (ఇది అనద్యతన భూతకాలము.)

౧౮. అద్యతన భూతకాలమున ప్రథమపురుషైక బహువచ నములలో మహత్తున నాఁడు-నారు, మహత్యర్థమున నది-నారు, అమహత్తున నది-నవి క్రమముగా వచ్చును.

వచ్చి+నాఁడు - వచ్చినాఁడు
వచ్చి+నారు - వచ్చినారు
వచ్చి+నది - వచ్చినది
వచ్చి+నవి - వచ్చినవి

౧౯. అద్యతన భూతమున మధ్యమ పురుషమున ఏక బహు వచనములలో నావు-నారు, ఉత్తమ పురుషమున నాను-నాము వచ్చును.

వచ్చి+నావు = వచ్చినావు
వచ్చి+నారు = వచ్చినారు
వచ్చి+నాను = వచ్చినాను
వచ్చి+నాము= వచ్చినాము

## వర్తమాన కాలము

౨౦. వర్తమానమున మహద్వాచకమున ప్రథమ పురుషలో ధాతువుపై ఏక బహువచనములలో ఉన్నాఁడు - ఉన్నారు, మహత్యర్థమున ఉన్నది-ఉన్నారు, అమహత్తులో ఉన్నది-ఉన్నవి, యగును.

౨౧. వర్తమానకాల క్రియా విభక్తులు పరమైనపుడు ధాతువునకు చు వర్ణ మాగమ మగును.

(మ) వచ్చు+చు+ఉన్నాఁడు=వచ్చుచున్నాఁడు
వచ్చు+చు+ఉన్నారు=వచ్చుచున్నారు
(మహతి) వచ్చుచున్నది-వచ్చుచున్నారు
(అమ) వచ్చుచున్నది-వచ్చుచున్నవి

౨౨. వర్తమానమున ఏక బహువచనములలో మధ్యమపురుషయందు ఉన్నావు - ఉన్నారు, ఉత్తమ పురుషయందు ఉన్నాను - ఉన్నాము వచ్చును.

వచ్చుచు+ఉన్నావు=వచ్చుచున్నావు.
వచ్చుచు+ఉన్నారు=వచ్చుచున్నారు.
వచ్చుచు+ఉన్నాను=వచ్చుచున్నాను.
వచ్చుచు+ఉన్నాము=వచ్చుచున్నాము.

## భవిష్యత్కాలము

౨౩. భవిష్యత్కాల క్రియావిభక్తులు పరమైనపుడు వచ్చు ధాతువునకు రాన్ ఆదేశమగును.

౨౪. భవిష్యత్కాలమున ఏక బహువచనములలో ప్రథమ పురుషయందు మహత్తున కలఁడు - కలరు, మహత్యర్థకమున కలదు - కలరు, అమహత్తున కలదు - కలవు వర్ణకము లగును.

రాన్+కలఁడు=రాఁగలఁడు-రాఁగలరు
రాఁగలదు-రాఁగలరు.
రాఁగలదు-రాఁగలవు.

౨౫. భవిష్యత్కాలమున ఏక బహువచనములలో మధ్యమ పురుషయందు కలవు-కలరు, ఉత్తమ పురుషయందు కలను - కలము వచ్చును.

రాఁగలవు-రాఁగలరు.
రాఁగలను-రాఁగలము.

## తద్ధర్మాద్యర్థకములు

౨౬. మూఁడు కాలములయొక్క ధర్మములను, తాచ్ఛీల్య సంభావనాది ధర్మములను తెలుపునట్టివి తద్ధర్మాద్యర్థకములు.

౨౭. తద్ధర్మార్థకమున ఏక బహువచనములందు ప్రథమ పురుషలో మహన్మహత్యర్థముల రెంటను ను - దురు, ఎదరు, అమహదర్థమున రెండు వచనము లందును ను వచ్చును.

వచ్చు+ను=వచ్చును, వచ్చుదురు, వచ్చెదరు, వత్తురు, చేరుదురు మొ

౨౮. తద్ధర్మమున ఏక బహువచనములందు మధ్యమ పురుషకు దువు - దురు - ఎదరు, ఉత్తమ పురుషకు దును-ఎదను, దుము - ఎదము వచ్చును.

వచ్చెదవు–వచ్చెదరు-వచ్చెదను–వచ్చెదము మొ. ఇతర రూపములును వీనికిఁ గలవు.

౨౯. ఆశీస్సు - శాపము - సంప్రార్థనముల యందు ఎడున్ - తన్ అనునవి వచ్చును.

(ఆశీస్సు) మీకు కీర్తి వచ్చెడును. మీకు మేలు కలుగుతన్.

(శాపము) తులువా నీకు లేమి వచ్చెడును. నీకు రాక్షసత్వము కలుగుత.

(ప్రార్థనము) దేవుని దయ మాపై వచ్చెడును. రమామాత మముఁ గృపఁ గాంచుత.

౩౦. విధ్యర్థమున 'అది' అనునది వచ్చును. దానికి ను గాగమము వచ్చును.

నీవు వచ్చునది. (ఆజ్ఞ) చేయునది-వ్రాయునది మొ.

౩౧. ప్రార్థనమున అ - ఆ - ఇ - ఈ-ఎ-ఏ-ఒ-ఓ-అమ్మ - అయ్య-ర-రా మొదలైనవి అనుప్రయుక్తము లగును.

రమ్మ+అ=రమ్మ, ఇట్లే చూడుమా-చేయుమి-పెట్టుమమ్మ.

౩౨. ఏకాశ్రయమైన రెండు ధాతువులు ప్రయోగింపఁబడినపుడు అసమాపకమైన క్రియకు ఇ వచ్చును. ఇదియే క్త్వార్థకము.

వచ్చు+ఇ=వచ్చి ఇట్లే: కని. విని-తిని మొ.

ఒక్కొక్కచో ఈ క్త్వార్థకము హేత్వర్థకముగాను వచ్చును.

వాన వచ్చి కథ ముగిసెను. తెగులు పట్టి పైరులు పోయెను.

౩౩. వ్యతిరేకార్థమున ధాతువుపై 'క' వచ్చును. ధాతువు యొక్క ఉకారము అ కారమగును.

వండు+క=వండక. తినక—చేయక-కొట్టక మొ.

వచ్చు+క=రాక,

౩౪. వర్తమానార్థమున క్రియాంతర సంబంధమున 'చున్' వచ్చును.

వాఁడు చూచుచుఁ బోవుచున్నాఁడు.

ఆడుచు, పాడుచు మొ.

౩౫. కర్త్రర్థమున ఎడు—ఎడి యగును.

వచ్చెడు వాఁడు, వచ్చెడి వాఁడు.

౩౬. కర్త్రర్థమున ధాతువుపై భూత భవిష్యద్వర్తమానము లందు ఇన-కల-ఉన్న వర్ణకములు క్రమముగా నగును.

వచ్చినవాఁడు. వచ్చుచున్న, రాఁగల.

౩౭. కర్మార్థకమున ధాతువునకు పడు అనుప్రయుక్తమగును.

ఉదా : కొట్టఁబడు మొ.

౩౮. ఆత్మనేపదక్రియలకు కొను ధాతు వనుప్రయుక్తమగును. అప్పుడు పూర్వధాతువు తుది ఉకార మికార మగును,

వండు+కొనియెను=వండికొనియెను. వండుకొనియెను.

౩౯. ఇ కారాదులు—ఎ కారాదులు నైన ప్రత్యయములు, అను ప్రయుక్తమైన కొను పరమైనపుడు ధాతువుల తుది య కారము స కార మగును.

చేయు+ఇ=చేసి. చేసికొని, చేసెడిని మొ.

౪౦. భావార్థమున ట కారము వచ్చును. కొన్ని యెడల దీనికి లోపమగును.

వచ్చుట చేయుట చూచుట మొ.

చూచుటకొఱకు=చూచుకొఱకు.

## ప్రేరణార్థకము

౪౧. ధాతువు లన్నింటిమీఁదను ప్రేరణార్థమున ఇంచు వర్ణక మగును.

ప్రేరణమనఁగా ఒకపని చేయునట్లు ప్రోత్సహించుట.

చేయు + ఇంచు=చేయించు.

౪౨. న కార, ల కార, డ కార, రేఫల ద్విత్వము తుది లేని తెలుఁగు ధాతువులకు ప్రేరణార్థమున చు వికల్పముగా వచ్చును.

పూను, పూనుచు, పూనించు.

౪౩. ప్రేరణార్థకమైన ఇంచు పరమైనపుడు కొన్నిట ధాతు చకారము పకారమగును.

(విను) వినుచు+ఇంచు=వినిపించు. తినిపించు మొ.

౪౪. ప్రేరణార్థకమైన ఇంచు పరముకాఁగా స్వార్థమున ఇంచు లోపించును.

రంజ్‌పై స్వార్థమున ఇంచు వచ్చి రంజించు అయినది. దానిమీఁద ప్రేరణమున ఇంచు వచ్చి రంజించు + ఇంచు కాగా మొదటి ఇంచు

లోపించి రంజించు అని అయినది. కావున రంజించు, అనగా రంజిల్లఁ జేయుట యనియు రంజించుట యనియు అర్థము వచ్చును. ఇట్లే భేదించు సంధించు మొ.

౪౫. ప్రేరణంబున మాను మొదలైనవానికి పు బహుళముగా వచ్చును.

(మాను) మానుచు, మానుపు (మను) మనుచు, మనుపు.

౪౬. కొన్ని ధాతువుల ఇంచు చు వర్ణమునకు భావార్థమున పు వర్ణక మాదేశమగును.

ఆరగిచు=ఆరగింపు, బెదరింపు, తెగింపు, తాలింపు, వర్ధింపు, ఊరేగింపు, రెట్టింపు మొ.

౪౭. అడ్డాదులకు ఇంచు పరమగునపుడు గు గాగమ మగును,

అడ్డము+ఇంచు=అడ్డగించు. ఇట్లే ఓర, పంతము, పెల్ల, మేళము. మట్టము మొ.

౪౮. ఇంచు-చు-పు వర్ణములు పరమైనపుడు రూపములు పెక్కువిధములుగా మాఱును. ఈ పట్టికలోని పదములను పరిశీలించునది.

| | | | |
|---|---|---|---|
| అడఁగు | అడఁగించు | అడఁచు | |
| మాయు | మాయించు | మాపు | |
| ఆఁగు | ఆఁగించు | ఆఁచు | ఆఁపు |
| రేఁగు | రేఁగించు | రేఁచు | రేఁపు |
| అగు | కావించు | | |
| వచ్చు | రావించు | రప్పించు | |
| నొచ్చు | నొంచు | నొప్పించు | |
| ఛినుఁగు | చించు | చింపు | |

| | | |
|---|---|---|
| మొగుడు | మొగుచు | మోదుచు మొగుడుచు<br>మొగిడించు |
| చొచ్చు | చొనుపు | చొప్పించు |
| మునుఁగు | ముంచు | మునుచు |
| డిగు | డిగించు | డించు |
| పెరుగు | పెంచు | పెనుచు |
| పోవు | పుచ్చు | పనుచు పంచు పంపు |
| పడు | పఱుచు | |
| కూడు | కూరుచు | కూడించు |
| ఓడు | ఓడుచు | ఓడించు |
| ఆడు | ఆడుచు | ఆడించు |
| పాయు | పాచు | పాపు |
| విఱుగు | విఱుచు | |
| లేచు | లేపు | |
| తెలియు | తెలుపు | |
| ఉండు | ఉనుచు | ఉంచు |
| చొచ్చు | చొనుపు | చొప్పించు |
| తెగు | తెంచు | త్రెంపు |
| మోసపోవు | మోసపుచ్చు | |
| పలవ | పలవరించు | పలవించు |
| ఆల | ఆలకించు | ఆలించు |
| వచించు | వచింపించు | |
| పిలుచు | పిటిపించు | |
| పరించు | పరింపించు | |
| వలచు | వలపించు | |

## శబ్దపల్లవములు

౪౯. క్రియలకు నామవాచకములకు ధాతువు లనుప్రయుక్తములై క్రొత్తయర్థముల నిచ్చిన నయ్యవి శబ్దపల్లవములు.

కూరిచి+ఉండు=కూరుచుండు.
నిలిచి + ఉండు=నిలుచుండు.
పడి+ఉండు=పరుండు. పన్నుండు.
అంకలి+కొను=అంకొను
ఈయ+కొను=ఈకొను, ఇయ్యకొను (ఒప్పుకొను)
రేకు+కొను=రెక్కొను, రక్కొను (వర్ధిల్లు)
త్రెంచు+కొను=త్రెక్కొను (చంపు)
మే+కొను=మేకొను (సమ్మతించు)
మై+కొను=మైకొను (సమ్మతించు)
మేలు+కాంచు=మేలుకాంచు (నిద్రతేచు)
అలవు+పడు=అలవడు (అభ్యాసమగు)
ఏర్చు+పడు=ఏర్పడు (తేటపడు)
చొప్పు+పడు=చొప్పడు (సరిపడు)
వెలి+పడు=వెలివడు (బయలుదేఱు)
తలపు+పోయు=తలపోయు (చింతించు)
వాయి+పోవు=వాపోవు (ఏడ్చు)
కొని+పోవు=కొంపోవు (తీసికొనిపోవు)
కై+వ్రాలు=కైవ్రాలు (ఒఱగు)
తూ+పొడుచు=తూపొడుచు (ఉమియు)
విజయము+చేయు=విజయంచేయు (వచ్చు, పోవు)

ఈ మొదలైనవి శబ్దపల్లవములని గుర్తించునది. ఆయా రూపములలోఁ గలియు ధాతువులు వేర్వేఱగు నర్థములనిచ్చునవియైనను, ఒకటిగా జేరినపుడు విలక్షణమైన యన్యార్థము నొసంగుచున్నవి.

## సకర్మక క్రియ - అకర్మక క్రియ

౫౦. క్రియలు రెండు విధములు. ఏ క్రియాపద ప్రయోగమున 'దేనిని' అను ప్రశ్న కలుగునో యవి సకర్మకములు. అట్టి ప్రశ్న కలుగనివి అకర్మకములు.

సకర్మకము : ఉదా : రాముఁడు పాఠమును జదివెను. ఈ వాక్యములో 'చదివెను' అనఁగానే దేనిని అను ప్రశ్న కలిగినది. పాఠమును అను సమాధానము వచ్చినది కావున సకర్మకము. ఇట్టివి సకర్మకములు.

అకర్మకము : ఉదా : చెట్టునుండి పండు పడెను. ఇట 'దేనిని పడెను?' అను ప్రశ్న కలుగదు. కావున పడెను అను క్రియ అకర్మకము. ఇట్లే అకర్మక క్రియలఁ దెలియునది.

## సకర్మక క్రియాపద ప్రయోగము

౫౧. కర్త్రర్థకాది భేదమున సకర్మక క్రియాపద మెనిమిది విధములు.

| | | |
|---|---|---|
| ౧. | కర్త్రర్థకము | బాలుఁడు పాఠము వ్రాసెను. |
| ౨. | కర్మార్థకము | బాలునిచేఁ బాఠము వ్రాయఁబడెను. |
| ౩. | ఆత్మనేపద కర్త్రర్థకము | బాలుఁడు పాఠము వ్రాసికొనుచున్నాఁడు. |
| ౪. | ఆత్మనేపద కర్మార్థకము | బాలునిచేఁ బాఠము వ్రాసికొనఁ బడుచున్నది. |
| ౫. | ప్రేరణ కర్త్రర్థకము | గురువు బాలునిచేఁ బాఠము వ్రాయింపఁగలఁడు. |
| ౬. | ప్రేరణ కర్మార్థకము | గురువుచేత బాలునిచేతఁ బాఠము వ్రాయింపఁ బడఁగలదు |
| ౭. | ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము | గురువు బాలునిచేత బాఠము చదివించు కొనును. |

| | |
|---|---|
| ౮. ప్రేరణాత్మనేపద కర్మార్థకము | గురువుచే బాలునిచేఁ బాఠము వ్రాయించు కొనఁబడుచున్నది. |

౫-౨. కర్త్రర్థకాది భేదమున అకర్మకక్రియాపదమైదువిధములు

౧. కర్త్రర్థకము : రాముఁడు వచ్చెను.

౨. ప్రేరణ కర్త్రర్థకము : విశ్వామిత్రుఁడు రాముని రప్పించెను.

౩. ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము : విశ్వామిత్రుఁడు రాముని రప్పించుకొనెను.

౪. ప్రేరణ కర్మార్థకము : విశ్వామిత్రునిచే రాముఁడు రప్పింపఁ బడెను.

౫. ప్రేరణాత్మనేపద కర్మార్థకము : విశ్వామిత్రునిచే రాముఁడు రప్పించుకొనఁబడెను.

——

# ౬. తద్ధితములు

౧. నామవాచకముల మీదను, కొన్ని విశేషణములమీఁదను భావార్థమతుబర్థాదులయందును స్వార్థమునందును విధింపబడు ప్రత్యయములు తద్ధితములు.

## భావార్థము

౨. (అ) భావార్థమున తన ప్రత్యయ మగును.

రాముని తనము-గొప్పతనము-పుల్లఁదనము-దొరతనము-మగతనము-మంచితనము మొ.

(ఆ) సంస్కృత ప్రాతిపదికముపై భావార్థమున త్వ అను ప్రత్యయము వచ్చును.

రామత్వము - కృష్ణత్వము

(ఇ) క్రియాజన్య విశేషణములపైనను తన ప్రత్యయము కొన్నిటఁ గనఁబడును.

ఓర్వలేనితనము - చేతకానితనము మొ.

౩. చిన్న మొదలైనవానికి భావార్థమున అిక ప్రత్యయము కూడ వచ్చును. అిక పరమైనపుడు పూర్వమందున్న ఇ కారము అ కారమగును.

చిన్నఅికము, పేదఅికము, వెఱ్ఱఅికము మొ.

౪. పేరు మొదలగు శబ్దములకు భావార్థమున ఇమి ప్రత్యయము వచ్చును.

పేరు + ఇమి = పేరిమి.

ఇట్లే కడిమి, ప్రముచ్చిమి మేలిమి, చెలిమి, పోఁడిమి, వాఁడిమి, వేఁడిమి మొ॥

౨. గుణవాచకములగు నల్ల, తెల్లమున్నగువానికి న వర్ణకమును భావార్థమునందగును. పూర్వమందున్న ఉ కారము అ కారమగును.
నల్ల+న=నల్లన.
ఇట్లే ఉప్పన-తెల్లన-పచ్చన-ఎఱ్ఱన-చామన-తియ్యన- పుల్లన-ఒయ్యన మొ.
(పక్షమున) నల్లఁదనము - తెల్లఁదనము మొ.

౬. అగ్గలము మొదలైన వానికి ఇక వర్ణకమగును.
అగ్గలము + ఇక-అగ్గలిక. ఇట్లే ఒమ్మిక మొ.

## స్వార్థము

౭. అరమర మున్నైన శబ్దములకు స్వార్థమున ఇక ప్రత్యయము వచ్చును.
అరమర+ఇక=అరమరిక.
ఇట్లే అమిక-నడవడిక-నివాళిక-పొత్తిక-మెలిక-వాలిక మొ.

౮. చిఱుత మొదలైన వానికి స్వార్థమున ఉక ప్రత్యయము వచ్చును,
చిఱుత+ఉక=చిఱుతుక.
ఇట్లే నాతుక- మెలఁతుక- పడఁతుక- పొలఁతుక- నిప్పుక - ఎమ్ముక మొ.

## మతుబర్థము

౯. (అ) ఆట మున్నైన శబ్దములమీఁది మతుబర్థమున మహద్వాచకమున కాఁ ప్రత్యయము - మహతీవాచకమున కత్తియ, కత్తె ప్రత్యయములును వచ్చును.
ఆఁట+కా+డు = ఆఁటకాఁడు. ఆఁట + కత్తె = ఆఁటకత్తె, ఆఁట+కత్తియ=ఆఁటకత్తియ.

అడపకాఁడు - ఎమ్మెకాఁడు - ఓయారకాఁడు - కటారికాఁడు - చెలిమికాఁడు—జూదకాఁడు. ఇట్లే చెలిమికత్తె మొ.

౧౦. కా, కత్తియ లలోని క కారమునకు గ కారము కొన్ని యెడల నగును.

అందగాఁడు-అందగత్తియ, బేరగాఁడు-బేరగత్తియ మొ.

౧౧. కా, కత్తియలు స్వార్థమునందుఁగూడ కనఁబడుచున్నవి. చెలికాఁడు, చెలికత్తె మొ.

౧౨. మృగాది వాచకములకును గొన్నింటికి కా ప్రత్యయ మగును.

కొమ్ముకాఁడు (అడవిపంది) పరికాఁడు (ఏనుగు) ఒంటికాఁడు (కాకి) మొ.

ఇట్లే: బూచికాఁడు, తోనికాఁడు గిజిగాఁడు మొ.

౧౩. అటమట మొదలైన శబ్దములకుఁ బుంలింగమునందు ఈఁ ప్రత్యయము వచ్చును.

అటమటము+ఈఁ+ఁడు=అటమటీఁడు.

ఇట్లే, కొండీఁడు, ఖానిసీఁడు, కన్నడీఁడు, బూటకీఁడు, మన్నీఁడు, సుంకీఁడు మొ.

౧౪. జాల, కల్ల మొదలైన శబ్దములకు అరి ప్రత్యయము వచ్చును.

జాలరి, ఒఱవరి, కల్లరి, చదువరి, జూదరి, టక్కరి, తగవరి, తెంపరి, నేరుపరి, సిగ్గరి, సుంకరి మొ.

౧౫. ఓయారము మొదలైన వానికి ఇ వర్ణకము వచ్చును.
ఓయారి, అక్కసి, కదలి, చాగి, జోగి, తుటారి, బండారి, బిత్తరి, బిటారి, బేహారి, మచ్చరి, మిటారి మొ.

౧౬. స్త్రీ బోధక కులవాచక శబ్దమునకు త వర్ణము వచ్చును.
చాకిత సాలెత, వ్రేత, బోయత, కుమ్మరిత, గొల్లత, మాలత మొదలగునవి.

౧౭. బహువచనాంతములైన వగాది శబ్దములకు స్త్రీవాచ్యంబైనపుడు 'ఆడి' ప్రత్యయము వచ్చును.
వగలు+ఆఁడి=వగలాఁడి.
ఇట్లే చిన్నెలాఁడి, కులుకులాఁడి, వన్నెలాఁడి, ఎమ్మెలాఁడి మొ.

౧౮. వగ, చిన్నె మొదలగు నీ శబ్దంబులకు మహదర్థమున ఆఁడు ప్రత్యయ మగును.
వగలాఁడు, చిన్నెలాఁడు మొ.

## తదభావార్థము

౧౯. ముక్కు మొదలైన వానికి వాని లేమిని దెలుపుచు 'ఇడి' ప్రత్యయము కలుగును.
ముక్కు+ఇడి=ముక్కిడి
ఇట్లే వావిడి, సిగ్గిడి, వెరనిడి మొ.

౨౦. పరిమాణార్థక శబ్దములకు 'ఎఁడు' ప్రత్యయము వచ్చును. పూర్వమందున్న 'లి' లోపించును.
దోసిలి+ఎడు=దోసెఁడు; తూము+ఎడు=తూమెఁడు, పుడిసెఁడు, పిడికెఁడు, సందెఁడు, మూరెఁడు, జేనెఁడు, గంపెఁడు మొ.

౨౧. ప్రమాణార్థమున బంటి కొలఁదు లగును.
ప్రమాణార్థ మనఁగా ఇంతలోఁతు అను నర్థము.
మోఁకాలిబంటి, మోఁకాలికొలఁది, బొమ్ముబంటి, బొమ్ముకొలఁది మొ.

౨౨. అర్థవిశేషముల తద్ధిత ప్రత్యయములు బహువిధములు. యథాప్రయోగముగ గ్రాహ్యములు.

| ప్రత్యయము | పదరూపము | అర్థము |
|---|---|---|
| మారి | మంటమారి | మండించుటయే శీలముగా గలది. |
| పోతు | తిండిపోతు | తినుటయే శీలముగాఁ గలవాఁడు. |
| ఇడి | వినికిడి | వినికి (స్వార్థమున) |
| ఇద | ఒప్పిదము | అందము ( ,, ) |
| మయ | తమోమయము<br>చీఁకటిమయము. | ఎక్కువ చీకఁటి కలది. |
| గొట్టు | పిసినిగొట్టు<br>వాపిరిగొట్టు | లోభి (స్వార్థమున గొట్టు) |
| కొట్టు (అని కొందఱు) | | |
| కారి | మాటకారి | వాగ్మి |
| అంత | చేటంత | పరిమాణార్థము |
| కార | నయగారము | మృదుత్వము (స్వార్థమున) |
| ఇత | పోరితము | పోరు (స్వార్థమున) |
| అ | అడప | వక్కలాకులుగల తిత్తిని) పట్టుకొనియుండు సేవకురాలు (మతుబర్థము) |
| అము | పెండ్లము | భార్య (మతుబర్థము) |

# ౭. కృదంతములు

౧. డు-రు-వు-రు-ను-ము అనువానిని విడచి ధాతువుపై వచ్చు తక్కిన ప్రత్యయములు కృత్తులనఁబడును.

౨. కృత్తు లంతమందు గల పదములు కృదంతములు.

౩. ప్రయోగానుసారముగ నివి భావ కర్తృ కర్మాద్యర్థము లందు వచ్చును.

౪. ఎఱుఁగు మొదలైనవానికి క ప్రత్యయము వచ్చును.

ధాతువులోని అర్ధానుస్వార గు కారములకు లోపమగును. దీర్ఘము మీఁది యర్ధానుస్వారమునకు లోపములేదు.

ఎఱుఁగు+క=ఎఱుక.

ఇట్లే మునుఁగు-మునుక; తునుఁగు-తునుక; మూఁగు-మూఁక; వీఁగు-వీఁక; కాఁగు-కాక; వచ్చునకు రా ఆదేశము-రాక; కినియు-కినుక (ఇకారమునకు ఉ కారము) ముదియు-ముదుక మొ.

౫. కను ధాతువునకు క-ఇక-పు ప్రత్యయములగును. ఇట్టి యెడ మొదటి యచ్చునకు దీర్ఘము వచ్చును.

కను+క=కానుక; కను+ఇక=కానిక; కను+పు=కానుపు

౬. కలుగు మున్నైన ధాతువులకు ఇమి ప్రత్యయ మగును.

కలుగు+ఇమి=కలిమి.

ఓరుచు-ఓరిమి; వేలుచు-వేలిమి; కూరుచు-కూరిమి; నేరుచు-నేరిమి; తాలుచు-తాలిమి; కలుగు ధాతువునకు వ్యతిరేకార్థమున లే ఆదేశము ఇ కారలోపము రాఁగా లేమి యని యగును.

౭. అణఁగు మొదలైనవానికి కువ వర్ణకము వచ్చును.

అణఁగు+కువ=అణఁకువ, మెలఁకువ; లోఁగు-లోఁకువ మొ.

౮. చేయు ప్రభృతులగు కొన్ని ధాతువుల యు కారమునకు బిందుపూర్వక త ప్రత్యయము వచ్చును.

చేయు+ంత=చేంత; మేయు-మేంత; కోయు-కోంత; గీయు-గీంత; నేయు-నేంత మొ.

కోయు, పాయు మొదలైనవానికి ఈ కార్యము కలుగదు.

౯. (అ) ఆడు మొదలైన కొన్నింటికి ట ప్రత్యయమగును.

ఆడు+ట=ఆట.

ఇట్లే: ఊరు-ఊట; ఊఁబడు-ఊఁబట; తేరు-తేట; ఓడు-ఓటము ఓట, ఓటమి; కూడు-కూటము, కూటమి.

(ఆ) ఆట అనుప్రయుక్తమైనపుడు ము వర్ణముకొన్నింటి కగును.

కోలాటము, పోరాటము, పోరాట, సయ్యాట, గొండ్లాట మొ.

౧౦. పడు మున్నగు వానికి టు ప్రత్యయము వచ్చును. ధాతువు తొలియచ్చునకు దీర్ఘమును, దానిమీఁది వర్ణములకు లోపము నగును.

పడు+టు=పాటు.

ఇట్లే: చెడు-చేటు, పొడుచు-పోటు, కఱచు-కాటు, వ్రేయు-వ్రేటు, గీచు-గీటు.

౧౧. పిలుచు ప్రభృతులకు పు ప్రత్యయ మగును.

పిలుచు-పిలుపు, తలఁచు-తలఁపు, వలచు-వలపు, ఇంచు-ఇంపు మాయు-మాపు, కాచు-కాపు మొ.

౧౨. ప్రేరణార్థకములైన దించు మొదలైన కొన్నింటికి పు వచ్చును.

దించు-దింపు; దంచు-దంపు; తెంచు-తెంపు; పంచు-పంపు; తాఁచు-తాఁపు; వేఁచు-వేఁపు; కూర్చు-కూర్పు; తీర్చు-తీర్పు మొ.

౧౩. ఆవులించు మొదలైనవాని చు వర్ణమునకు త వచ్చును.
ఆవులించు-ఆవులింత; ఇగిలించు-ఇగిలింత; వెక్కిరించు-
వెక్కిరింత; కౌఁగిలించు-కౌఁగిలింత మొ.

౧౪. తిరియు లోనైన వానికి 'ప' వచ్చును.
తిరియు-తిరిపము, మురియు-మురిపము మొ.

౧౫. ఓపు ప్రభృతులకు 'ఇక' ప్రత్యయ మగును.
ఓపు+ఇక=ఓపిక.
ఇట్లే పొగడిక, కలయిక, కోరిక, పొందిక మొ.

౧౬. అఱుగు మొదలైన వానికి దల ప్రత్యయము వచ్చును.
అఱుగు+దల=అఱుగుదల.
ఇట్లే ఒప్పుదల, పట్టుదల, పొఱుదల, తగ్గుదల, క్రమ్ముదల మొ

౧౭. కోరు లోనగు వానికి 'ఇకి' ప్రత్యయ మగును.
కోరు+ఇకి=కోరికి.
ఇట్లే వినికి, పోలికి, మనికి, పూనికి.

౧౮. ఏలు మున్నైన వానికి బడి ప్రత్యయ మగును.
ఏలు+బడి=ఏలుబడి.
కొనుబడి, చెల్లుబడి, గిట్టుబడి, పోఁబడి మొదలైన విట్లే.

౧౯. చేరు ప్రభృతులకు గడ ప్రత్యయ మగును.
చేరు+గడ=చేరుగడ.
తిరుగు+గడ=తిరుగడ (తుదివర్ణలోపము)
ఇట్లే విరుగడ, ఈఁగడ మొ.

౨౦, నిలుచు-పోవు-వచ్చు లకు కడ యగును.
నిలుకడ, పోకడ, రాకడ.

౨౧. కాచు లోనగు వానికి 'వు' వచ్చును.

కాచు+వు=కావు

ఇట్లే కొలుచు-కొలువు; నొచ్చు-నొవ్వు, నోవు; పూచు-పూవు, చచ్చు-చావు; తడయు-తడవు మొ.

౨౨. మాఱు మొదలైన వానికి అక ప్రత్యయ మగును.

మాఱు+అకము=మాఱకము.

అమ్ము- అమ్మకము; అద్దు - అద్దకము; పెంచు - పెంపకము; నమ్ము—నమ్మకము; వండు-వంటకము (డకారమునకు టకారము.)

౨౩. ఎండు మున్నైన వానికి 'అ' ప్రత్యయము వచ్చును.

ఎండు+అ=ఎండ.

ఇట్లే తునియు-తునియ; చదియు - చదియ; పాయు-పాయ; పిడుచు-పిడుచ; చేఁదు-చేఁద: కాచు-కాయ (య కారాదేశము).

౨౪. పెంచు లోనగువానికిఁ గొన్నింటికి డు ప్రత్యయమగును. అట్టియెడ చ కార య కారములకు ప కారము వచ్చును.

పెంచు-పెంపుడు; మాయు-మాపుడు; దాఁచు-దాఁపుడు; దోఁచు—దోఁపుడు; చూచు-చూపుడు మొ.

౨౫, ఈ పట్టికలోని కృదంతరూపములను గుర్తించునది.

| ప్రత్యయము | కృదంత రూపము. |
|---|---|
| ఉ | ఒప్పు, ఒసగు, పట్టు, మ్రొక్కు, చదువు, కులుకు, పలుకు. వెలుఁగు, పండు, పొగడు, పొంగు మొ. |
| వి | తెలియు+వి=తెలివి, తనియు + వి = తనివి, విరియు+వి=విరివి. |
| ఇ | చేయు + ఇ = చేయి, వాయి, కూయి. (గ్రొయ్యి) గోయి. గ్రొయ్యి, (దయ్యి) దప్పి, దప్పి, (నొయ్యి) నొప్పి, (పుచ్చు) పుప్పి. |

| ప్రత్యయము | కృదంత రూపము |
|---|---|
| అన | అప్పగించు + అన = అప్పన. గదన, వడ్డన, దీవన, పీవన, మన్నన మొ. |
| ఎన | దువ్వు+ఎన=దువ్వెన. కందెన, ఈర్పెన, (ఉబ్బు) ఉప్పెన. |
| కలి | వినుకలి, కనుకలి, |
| వడి | నడవడి, గెలువడి. కొలువడి, (కలుగునకు వ్యతిరేకమున) లేవడి |
| వ | విలుచు+వ=విలువ, కొదరు-కొదువ, నిలుచు-నిలువ. చొచ్చు-చొరవ, తగ్గు-తక్కువ, ఎక్కు-ఎక్కువ, తెగు-తెగువ. |
| వ | ఎగుచు-ఎగువ, దిగుచు-దిగువ. |
| డు | ఎగుచు-ఎగుడు, దిగుచు-దిగుడు. |
| మతి | ఎగుమతి, దిగుమతి. |
| ఇలి | అంకిలి, ఒదిగిలి. |
| ఇడి | రాపిడి, దోఁపిడి, (పాయు) పాపడి. |
| ఇత | పొగడిత. |

# ౮. ద్రుతప్రకృతికములు - కళలు

౧. తెలుఁగుభాషలోని పదములు ద్రుతప్రకృతికము లనియు, కళ లన్నియు రెండు విధములు.

౨. న కారము ద్రుతము నాఁబడును.

ద్రుతమనఁగా ద్రవించు స్వభావముగలది యని యర్థము. అవసరము లేనియపుడు మఱుఁగుపడునది యని భావము. ప్రత్యయము ఆగమము, అవ్యయము నైన ను అనునదియే ద్రుతము.

వృక్షము ను, రామునిచేత ను, అన్నయు ను, తమ్ముడు ను.

౩. ద్రుత మంతమందుఁ గల పదములు ద్రుతప్రకృతికములు

(అ) నామ విభక్తులలోని - ను; చేతన్ - చేన్; తోడన్ - తోన్; కొఱకున్; వలనన్ — కంటెన్; కున్- లోపలన్; అందున్ అనునవి యంతమందుఁగల పదములు ద్రుతప్రకృకములు.

రామున్నిన్ - రామునికొఱకున్ మొ.

(ఆ) క్రియా విభక్తులలో ఎను - తిని - నాను - ఉన్నాను - కలను-ను-దును - ఎదును - ఎదిని - ఎదను - అను - తను అనునవి తుదఁగల పదములన్నియు ద్రుతప్రకృతికములు.

వచ్చెను-వచ్చును-వచ్చెదున్-కావుతన్ మొ.

(ఇ) అవ్యయములలో కొట్టుచున్- కొట్టన్- కొట్టఁగన్- కొట్టుదున్-కొట్టినన్ మొదలైన చున్-అన్-ఇన్-దున్ ప్రత్యయాంతములును,వలెన్-పోలెన్-కై వడిన్-ఇఁకన్-అందుకున్ వంటి నకారాంతములైనవియు ద్రుతప్రకృతికములు.

(ఈ) మఱియు నను నర్థమునవచ్చు ఉను అంతమందుఁగల పదములు ద్రుతప్రకృతికములు.

రాముఁడును, కృష్ణుఁడును.

(ఉ) ఇకార లోపము నందిన ఏని ద్రుతప్రకృతికము.

రామునేని - రామునేన్.

(ఊ) సర్వనామవాచకములలో నేను_తాను ద్రుతప్రకృతికములు.

(ఋ) సంధియందును, సమాసమందును ఆగమముగా వచ్చిన నకారము తుదఁగలవి ద్రుతప్రకృతికములు.

ప్రాఁజదుపు. చిగురుఁగై దువు మొ.

## కళలు

౪. ద్రుతప్రకృతికములు గానివన్నియు కళ లనఁబడును.

రాముఁడు, వృక్షము, గురువు-ఇట్టి నామవాచకములు కళలు.

౫. ని-ను తుద లేని క్రియాపదములు కళలు.

వచ్చిరి, వచ్చినాఁడు, వచ్చితిరి మొ.

౬. నకారము తుదలేని యవ్యయములు కళలు.

(అ) ఔరా, ఓహో, ఆహా మొదలైన యాశ్చర్యార్థకములు కళలు.

(ఆ) భళి, బాపురే, మజ్జా, మజ్జారే, అమ్మకచెల్ల మొదలైన ప్రశంసార్థకములు కళలు.

(ఇ) ఊరక, మిన్నక మున్నైనవి కళలు.

(ఈ) అయ్యో, కటా, కట్టా, కటకటా, అక్కటా మొదలగు సంతాప సూచకములును,

(ఉ) ఏల, ఏలా, ఏమి, ఏమీ, లోనగు ప్రశ్నార్థకములు కళలు.

(ఊ) వచ్చుట, పోవుట, మున్నైన భావార్థకములు కళలు.

(ఋ) చేసి, చేయక లోనైన యసమాపక క్రియావాచకములు కళలు.

(ౠ) ఇపుడు, అపుడు, ఎపుడు అనునవి కళలు.

(ఌ) కద, కదా, కాదే, అఁటకా మొదలైన 'అవునుగదా' యను నర్థము గలవి కళలు.

(ౡ) ఇంచుక, కాసంత, కొంచెము మొదలైనవి కళలు.

(ఎ) అ-ఎ-ఏ అను నిశ్చయార్థకములైన అవ్యయములు తుదఁగలవి కళలు.

౭. ప్రథమైక వచనము లేనిపదములు, ని-ను వర్ణములు తుదనున్నవి, నామవాచక విశేషణాదులు కొన్నికన్పట్టును. అట్టివి కళలే.

గని-పని-కొలను-చేను-పేను-మ్రాను- తెల్లన- చక్కని మొదలైనవి కళలే యని గుర్తించునది.

———

# ౯. రేఫ - శకట రేఫములు

౧. రేఫము రెండు విధములు.

తెలుఁగు పదములలో ర అను నక్షరము గలవియు, ఱ అను నక్షరము గలవియుఁ గన్పట్టును. ఊరు, పేరు, ఆఱు, వేఱు, మొదలైనవి. వీనిలో ర అనునది సాధురేఫ మనియు, ఱ అనునది శకటరేఫ మనియు వ్యవహరింపఁ బడును. శకటరేఫమునే బండి ఱ అందురు. ఉచ్చారణమున వీనికిఁ గొంచెము భేదము గలదు. ర తేలికగాను, ఱ మొద్దగాను పలుకఁబడును.

౨. రేఫ-ఱ కారములను నిర్ణయించు ప్రత్యేకానుశాసనము లేదు. ప్రయోగమువలన నివి తెలిసికొనఁ దగినవి,

౩. కొండగుర్తుగాఁ గొన్నింటి నిట్లు గ్రహింపవచ్చును.

## సాధురేఫము (ర)

౪. (అ) తత్సమ పదములలో శకట రేఫము లేదు.
హరి, రంభ, కరము, రాగము మొ.

(ఆ) తద్భవములలోను మొఱకు, కఱకు, ఉక్కెఱ, కాఱియ, పెఱ, పిఱికి, గఱి, గోఱజము వంటి కొన్నిదక్క-తక్కినవి సాధు రేఫములే.
అరదము, తామర, బీరము, కపురము మొ.

(ఇ) హల్లులతోఁ గూడిన వన్నియు రేఫములే యగును.
నేర్పు, కార్తె, చేర్చుక్క, ఇనుగుర్తి, బిర్బిర, నీర్వామి మొ.

(ఈ) క్రియావిభక్తులలో రి, రు సాధురేఫములు,
చూచిరి, వచ్చిరి చూచుచున్నారు, వ్రాయుదురు, వ్రాయరు, లేరు రారు మొ.

(ఉ) తద్ధితములలో మతుబర్థమున వచ్చు అరి ప్రత్యయాంత ములు సాధురేఫాంతములు.

జాలరి. కల్లరి, సుంకరి, చదువరి మొ.

(ఊ) తాచ్ఛీల్యమున వచ్చు మారి సాధురేఫాంతము.
మాటలమారి, చిక్కులమారి, జిత్తులమారి మొ.

(ఋ) నేర్పుగలదియను నర్థమునిచ్చు కారి సాధురేఫాంతము.
మాటకారి, పొంతకారి మొ. (పొంతకాఱి యని కొందఱు)

(ౠ) స్వార్థమునవచ్చు కార ప్రత్యయము సాధురేఫము గలది.
నయగారము, చెలికారము, సుడికారము మొ.

(ఌ) సంఖ్యావాచకములగు గురు-వురులు సాధురేఫము గలవి.
ఇరువురు, ముగ్గురు, నలుగురు, ఏవురు, వేవురు మొ.

(ౡ) తమరు, తారు, ఎవరు, వారు, వీరు, మీరు మొదలైనవి సాధురేఫము గలవి.

## శకట రేఫము (ఱ)

౨. (అ) రేఫద్విత్వములన్నియు బండిఱా గలవియే.
ఇఱ్ఱి, కఱ్ఱి, జెఱ్ఱి, వెఱ్ఱి.

(ఆ) ద్విత్వలోపము వచ్చినను బండిఱా మాఱదు.
జెఱిపోతు, కఱిమేక.

(ఇ) పఱ్ఱు, కుఱ్ఱు, తుఱ్ఱు, మఱ్ఱు మొదలైన గ్రామవాచకాంత ములు శకటరేఫము గలవి.

పాలపఱ్ఱు, ఎలకుఱ్ఱు, మొగలితుఱ్ఱు, పామఱ్ఱు.
ఔపవిభక్తిక తి చేరినపుడివి పాలపర్తి లోనగు రూపములగును.

(ఈ) తద్ధితములలో టిక ప్రత్యయము శకటరేఫము గలది.
చుట్టటికము, పెద్దటికము. కన్నెటికము మొ.
ఇవి యుభయరేఫ ఘటితములని కొందఱందురు.

(ఉ) అఱు ధాతువుయొక్క యసమాపక క్రియారూపమైన అటి తోఁగూడి వచ్చు పదములు బండిఱా గలవి.
ఉక్కటి, రూపటి, పెంపటి, సిగ్గటి, బలమటి మొ.

(ఊ) సర్వనామ సంఖ్యా వాచకములలోఁ గొన్ని శకటరేఫము గలవి.
అందఱు, ఎందఱు, కొందఱు, ఇందఱు, ఇద్దఱు, ఆఱు, నూఱు

## ఉభయ రూపములు

కొన్నింట రేఫయు, బండిఱాయుఁ గనఁబడును.

| | |
|---|---|
| అరుగుట | అఱుగుట (పోవుట) |
| చెరచుట | చెఱచుట |
| తెరఁగు | తెఱఁగు (విధము) |
| తొరఁగు | తొఱఁగు |
| పరి (సేన) | పటి (విధము) |
| పరిమెయి | పటిమెయి |
| పెరుగు | పెఱుగు |
| సీరు (జలము) | సీఱు (బూడిద) |
| క్రమ్మర | క్రమ్మఱ |
| నెరయు | నెఱయు |
| ఆరు | ఆఱు (తగ్గు) |
| తీరు | తీఱు |
| మారు | మాఱు |

శకటరేఫ మాదియందుఁగల కొన్ని పదములు :

ఱంకె, ఱంతు, ఱంపము, ఱంపు, ఱక్క, ఱవఱవ, ఱప్ప, ఱవిక. ఱవ్వ, ఱాయి, ఱాగ, ఱింగు, ఱిక్క, ఱిచ్చపాటు, ఱువ్వ, ఱెక్క, ఱెప్ప; ఱెల్లు, ఱేఁడు. ఱేకు, ఱేవు, ఱేయి, ఱొచ్చు, ఱొమ్ము, ఱోలు మొ.

శకటరేఫ మధ్యమునందు వచ్చినవి కొన్ని :

అఱము, ఇఱుసు. ఇఱుకు, ఉఱుము, ఊఱట, ఎఱుక, తుఱుము, తెఱవ, చెఱుపు. ఎఱుపు. కుఱులు, కుఱుపు, కొఱడు, కఱటి. కఱవు, మఱువ, మఱఁది. మెఱుపు, వఱడు, మొఱక, నుఱుము, చఱియ, అఱిసె, కొఱవి, తఱపి, ఎఱువు. కఱకరి, మాఱకము, వేఱడము, గోఱజము, పాఱుఁడు, చీఱుట, తాఱుట, హజాఱము, తిఱుగలి, చెఱసాల, అఱికెలు మొదలైనవి

శకటరేఫాంత పదములు కొన్ని :

అఱ, ఉఱు. ఎఱ, ఒఱ, కఱ, కఱి. కొఱ, కోఱ, కూఱు, గీఱ, చిఱు, తఱి, నెఱి, నెఱ, ముఱి, వెఱ, బీఱ, మాఱు, వేఱు, మొఱ, అక్కఱ, క్రచ్చఱ చిచ్చఱ, ఉక్కెఱ, పగఱ, పక్కెఱ, అంపఱ, తంబుఱ. పాఁతఱ, వాతెఱ, పాఱ, చీదఱ, తెంపఱ, ఆఱు వేమాఱు, ఊఱు! బిఱబిఱ, కాఱు, ఱుపా, ఏత్తెర, అపదూఱు, అఱపొఱ అఱిముఱి. తుజాఱి, మిడుగుఱు, పొన్నాఱి, గడిదేఱు మొదలైనవి.

———

# ౧౦. అనుస్వారము

౧. స్వర మనగా అచ్చు. అచ్చు ననుసరించి వచ్చునది యనుస్వారము. సున్న యచ్చునంటియే వచ్చును. కావున సున్న కనుస్వార మని పేరు. దీనినే బిందు వనియు నందురు.

౨. అనుస్వారము రెండు విధములు : ౧. పూర్ణానుస్వారము ౨. ఖండానుస్వారము.
వరుసగా వీనినే నిండుసున్న, అరసున్న యనియు నందురు.

౩. (ం) నిండుసున్న పదోచ్చారణమున వినబడును.
( ఁ ) అరసున్న కుచ్చారణము లేదు.
తంౘడి, ఇఁక.

౪. ఉచ్చారణము లేనిదయ్యు ఖండబిందువు ప్రకృతిపదముల లోని యనునాసికాదులకు జ్ఞాపకముగాను, ద్రుతసంధులలో గకారాదులుగా మాఱిన పదముల నిజస్వరూపమును దెలుపు సాధకముగాను సార్థక మగుచున్నది.
(బ్రాహ్మణః) బాఁపన+అయ్య=బాఁపనయ్య
విరిసెన్+కమలము=విరిసెఁ గమలము.

౫. (అ) సిద్ధ సాధ్య భేదమున నీ యుభయానుస్వారము లను తిరిగి రెండు తెఱఁగులు.
(అ) శబ్దముయొక్క పుట్టువునుండియే యుండునది సిద్ధము.
(సిద్ధపూర్ణబిందువు) బండి, జింక.
(సిద్ధఖండబిందువు) ఈఁగ, ఆఁకలి.

(ఇ) శాస్త్రవశమునఁ బిమ్మట వచ్చినది సాధ్యము.
సాధ్య పూర్ణబిందువు : చదువ ం గలఁడు.
సాధ్య ఖండబిందువు ; చదువ ఁ గలఁడు.

కొన్ని పదములలో అరసున్న, నిండుసున్నలు రెండును గనఁబడును. హ్రస్వముమీఁది యరసున్న వికల్పముగా నిండుసున్న యగును.

ఆరఁటి – అరంటి; మగఁటిమి – మగంటిమి; ఎఱుఁగును – ఎఱుంగును.

౭. (అ) అచ్చ తెనుఁగులో దీర్ఘాక్షరము మీఁద నిండుసున్న శాస్త్రవశమున రాదు. అరసున్న రావచ్చును.
వాఁడు, వీఁడు, రాఁడు, లేఁడు మొదలైనవి.
వాండు, వీండు, రాండు, లేండు మున్నగు రూపములనొందవు.
కోఁత, తోఁట, అను విధముగా అరసున్న రావచ్చును.

(ఆ) వాడుకలోఁ గొన్ని యిట్టివి గలవు.
గోఁగూర, గోంగూర
ఆఁబోతు, ఆంబోతు
చేఁదుతాడు, చేంతాడు
మూఁకుడు, మూంకుడు
ఇట్లే పేంద, కాంచు, చీంబోతు మొదలైనవి.
మూండు–వాండు (ప్రాచీన ప్రయోగములు.)

౮. అచ్చతెనుఁగుపదములలో అరసున్నగాని, నిండుసున్నగాని యున్నచో నవి పరుష సరళములకు వెనుకనే యుండును.

పరుష పూర్వములు : సుంకేరి, కడఁక, కంచము, త్రాఁచు, మంట, వేఁట, గంత, వ్రాఁత, కుంప, కాఁపు.

సరళ పూర్వములు: పొంగు, రేఁగు, గుంజ, గాఁజర, కుంద, గూఁడు, కంద, గోఁదు, బెంబు, తాఁబేలు మొ.

దీనికి విరుద్ధముగా కంసాలి యను పదము వాడుకలో నున్నది కమసాలి పదము పలుకుబడిలో నిట్లు మాఱినది.

౯. అఁట, ఇఁక, ఇఁగ, చుఁడు, అఁడుగో, ఇఁడుకో అను పదములను వీఁడి తక్కిన యేపదము మొదటి అచ్చు మీఁదను అర్ధబిందు వుండదు. రెండవ అచ్చుమీఁదనో దీర్ఘముమీఁదనో కనఁబడును.

పులుఁగు, వెలుఁగు, మూఁపురము, మొ.

## సాధ్యబిందువు వచ్చు విధము

౧౦. నామవాచకములపై వచ్చు ప్రథమైకవచనప్రత్యయమగు డు బిందుపూర్వకము.

రాముఁడు. కృష్ణుఁడు. మగఁడు. గుణవంతుఁడు, వాఁడు, వీఁడు, అతఁడు, ఒకఁడు.

౧౧. క్రియాపదములపై వచ్చు ప్రథమైకవచన ప్రత్యయ మగు డు అనునది బిందుపూర్వకము.

చదువుచున్నాఁడు, వ్రాయుచున్నాఁడు, మొ.

౧౨ క్రియలపై మధ్యమపురుషలోఁ బ్రార్థనార్థకమున వచ్చు డు ప్రత్యయమునకు వెనుక బిందువు వచ్చును.

చదువుఁడు. వ్రాయుఁడు, చేయుఁడు మొ.

౧౩. వ్యతిరేక ప్రార్థనమందు ధాతువుపైఁజేరు డు ప్రత్యయము నకును వెనుక బిందువుండును.

చేయకుఁడు, చూడకుఁడు, వ్రాయకుఁడు మొ.

౧౪. వ్యతిరేక క్రియలకు వచ్చు డు ప్రత్యయము బిందు పూర్వకము.

చేయఁడు, రాఁడు, లేఁడు మొ.

౧౫. తద్ధిత ప్రత్యయములలో అరసున్న రూపములు.

| ప్రత్యయము | రూపము |
|---|---|
| కాఁడు - (గాఁడు) | చెలికాఁడు - అందగాఁడు |
| ఈఁడు - గీఁడు) | ఆటమటీఁడు - దుండగీఁడు |
| ఆఁడు - ఆఁడి | వన్నెకాఁడు - వన్నెలాఁడి |
| ఇఁడి | ముక్కిఁడి - సిగ్గిఁడి |
| ఎఁడు | కుంచెఁడు — దోసెఁడు |
| తన | సొగసుఁదనము — సరసపుఁ దనము - తెల్లఁదనము. |

౧౬. కృదంతములలో బిందువున్న రూపములు:

త (యుకారాంత క్రియలపై) చేఁత-పూఁత-నేఁత-కోఁత మొ.

అన్ (పడు-కల—కన్-కాన్ పరము కాఁగా) చేయఁబడు - చేయఁబడుచు-చేయఁగల - చేయఁగన్-చేయఁగాన్ మొ

౧౭. పదములలోఁ గొన్నింట మార్పు వచ్చినపు డరసున్న గనఁబడును.

| | | | | |
|---|---|---|---|---|
| (అ) | రేను | (గు ఆదేశము) | రేఁగు - | రేఁగులు |
| | గోను | ,, | గోఁగు - | గోఁగులు |
| | కోలను | (కు ఆదేశము) | కొలఁకు - | కొలఁకులు |

ఇట్లే కెలను-వలను-మ్రాను-గవను-నెఱను - కొఱను మొదలైన వానికిని రూపము లగును.

(ఆ) సమాసమునందు ఖండబిందువు వచ్చునవి:

నాము + చేను (ప) నాఁపచేను
వేము + చెట్టు ,, వేఁపచెట్టు
పాము + తేఁడు ,, పాఁపతేఁడు
ప్రేమ + బెత్తము ,, ప్రేఁపబెత్తము
చిగురు + కైదువు = చిగురుఁ గైదువు
సింగపు + కొదమ = సింగపుఁ గొదమ
తల + ప్రాలు = తలఁబ్రాలు

(ఇ) ద్రుతము మీఁది పరుషములు సరళములైన స్థలములలో వాని వెనుకను ఖండ బిందువు వచ్చును.

పూచెన్ + కలువలు = పూచెఁగలువలు
శ్రీరామునిన్ + చూచెను = శ్రీరామునిఁ జూచెను
నేర్చెన్ + టక్కరితనము= నేర్చెఁ దక్కరితనము
పోయెన్ + తనయూరు = పోయెఁ దనయూరు
వచ్చెన్ + పండుగ = వచ్చెఁ బండుగ మొ.

సిద్ధ బిందువుగల పదములను ప్రయోగముల బట్టి తెలిసికొనవలెను.

# ౧౧. పదపరిశీలనము

౧. పదములు వాడునపు డొక యక్షరమునకు వేరొక యక్ష రము వ్రాయుటగాని, చదువుటగాని తగదు. వీనినిఁ బరికింపుఁడు.

తెలుఁగు పదములకు మొదట య-వు-వూ-వొ-వో అను నక్షరములుండవు. సంధివశమున వచ్చినప్పుడు వ్రాయవచ్చును.

అతఁడు వచ్చెననుట సరికాని, యతఁడు వచ్చెననుట సరికాదు.

హరి అడిగెను-హరి యడిగెను అని వ్రాయవచ్చును.

యెవరు, వూరు, వొకటి, వుప్పు వ్రాయరాదు.

౨. ఇ కారమునకు ఉ కారము వ్రాయుట కూడదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| వ్రాసికొనుచున్నాఁడు | వ్రాసుకొనుచున్నాఁడు. |

౩. ఋ కారము వట్రుసుడులకు, రు కారము, క్రావడి వ్రాయఁదగవు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ఋతువు | రుతువు |

ఈ ఋకారాదిపదములు గుర్తింపఁదగినవి :

ఋష్యమూకము, ఋష్యశృంగుఁడు, ఋక్షము, ఋషి, ఋగ్వేదము, ఋజుమార్గము.

| ఒప్పు | తప్పు |
|---|---|
| కృష్ణుఁడు | క్రుష్ణుఁడు |

ఇట్లే: వృకము, పృథ్వి, వృత్తము, వృష్టి, సృష్టి, కృషి మొ

౪. క్రావడికి ఋకారము వ్రాయఁగూడదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| క్రూరుఁడు | కౄరుఁడు |
| క్రుధ | కృధ |
| శ్రుతి | శృతి |
| స్రుక్స్రువములు | సృక్సృవములు |
| శుశ్రూష | శుశౄష |
| ద్రుపదరాజు | దృపదరాజు |
| ధ్రువము | ధృవము |
| క్రుంగెను | కృంగెను |
| త్రుళ్ళిపాటు | తృళ్ళిపాటు |
| అధ్రువ | అధృవ |

౫. హల్లును అచ్చులుగా వ్రాయఁకూడదు.

వచ్చునకు ఒచ్చు—అచ్చు అనియు, వెళ్ళునకు-ఎళ్లు-ఎల్లు అనియు, పెట్టునకు ఎట్టు అనియు వ్రాయఁదగదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| రాముఁడు వచ్చెను | రాముఁడొచ్చెను |
| | రాముఁడచ్చెను |
| కృష్ణుఁడు వెళ్ళెను | కృష్ణుడెళ్ళెను, కృష్ణుడెల్లెను |
| అన్నము పెట్టినది | అన్నమెట్టినది |

౬. ఉకారముమీఁద యడాగమము రాదు

రాముఁడు + ఉన్నాడు = రాముఁడున్నాడు ఒప్పు

= రాముఁడు యున్నాడు తప్పు

౭. ద్రుతప్రకృతికముమీఁది యచ్చు య కారముకాదు.

రామునిన్ + అడిగితిని = రాము నడిగితిని ఒప్పు

= రాముని యడిగితిని తప్పు

ఎచ్చటన్ + ఉన్నాఁడు = ఎచ్చట నున్నాఁడు ఒప్పు

= ఎచ్చట యున్నాఁడు తప్పు

౮. కళల మీఁద నకారాగమము జేయఁగూడదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| సీత యాడెను | సీతనాడెను |
| చేసి యలసెను | చేసి నలసెను |
| చూడక యుండెను | చూడక నుండెను |

౯. ము (ం) సున్న గాదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| అది మా పొలము | అది మా పొలం |
| చూచినాము | చూచినాం |

౧౦. నకారమును సున్నగా వ్రాయఁగూడదు.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| అయినది | అయింది | పడినది | పడింది |

౧౧. సముచ్చయ ఉకారమునకు ద్విత్వ దీర్ఘములు చేయరాదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| రాముఁడును కృష్ణుఁడును వచ్చిరి. | రాముఁడున్ను కృష్ణుఁడున్ను వచ్చిరి |
| అతఁడును-ఇతఁడును | అతఁడున్నూ-ఇతఁడున్నూ |

౧౨. ని అనుదానిని ణ్ణి-డి అని వ్రాయుట సరికాదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| కృష్ణుని | కృష్ణుణ్ణి |
| వానిని | వాడిని-వాణ్ణి |
| రామునికొఱకు | రాముఁడికొఱకు |

౧౩. ఖ-ఘ లను తారుమాఱు చేయఁగూడదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| సుఖము | సుఘము |
| సఖుఁడు | సఘుఁడు |
| ముఖము | ముఘము |

| ఒప్పు | తప్పు |
|---|---|
| మేఘము | మేఖము |
| అఘము | అఖము |
| రఘుమహారాజు | రఖుమహారాజు |

౧౪. "జ్ఞ" కు బదులు "గ్న" వ్రాయరాదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| జ్ఞానము | గ్నానము |
| యజ్ఞము | యగ్నము |
| విజ్ఞానము | విగ్నానము |
| జ్ఞాతి | గ్నాతి |
| ప్రజ్ఞ | ప్రగ్న |

౧౫. థ ధ వర్ణముల నొకదాని కొకటి వ్రాయఁగూడదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ధనము | థనము |
| ధాన్యము | థాన్యము |
| స్థితి | స్ధితి |
| స్థానము | స్ధానము |

థ కారము మొదటగల పదములు లేవు.

౧౬. న ణ లను గుర్తించి వ్రాయునది.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ప్రాణము | ప్రానము |
| గుణము | గునము |
| వినయము | విణయము |
| రామాయణము | రామాయనము |
| కల్యాణము | కల్యానము |
| ఒడ్డాణము | ఒడ్డానము |

౧౭. ఒత్తక్షరముల నొకదాని కొకటి వ్రాయఁదగదు.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| పాఠము | పాటము | కష్టము | కష్ఠము |
| అదృష్టము | అదృష్ఠము | శ్రేష్ఠము | శ్రేష్టము |
| గోష్ఠి | గోష్టి | సృష్టి | సృష్ఠి |
| భారతము | బారతము | బాణము | భాణము |
| సభ | సబ | భయము | బయము |
| ఫలము | పలము | బలము | భలము |
| బావి | భావి | బావ | భావ |
| బంగారము | భంగారము | భంగము | బంగము |
| ప్రభుత్వము | ప్రబుత్వము | బరువు | భరువు |
| విద్య | విధ్య | మద్యము | మధ్యము |
| ప్రస్తుతము | ప్రస్థుతము | స్వేచ్ఛ | స్వేచ్చ |
| స్వచ్ఛము | స్వచ్చము | అశ్వత్థామ | అశ్వద్ధామ |
| భర్త | బర్త | బంధువు | భందువు |
| బాధ | భాద | సంబంధము | సంభందము |
| శబ్దము | శబ్ధము | భేదము | బేధము |
| దార | ధార | దుర్గంధము | ధుర్గందము |

౧౮. ర్ణ ను ర్న గా వ్రాయరాదు.

| ఒప్పు | తప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| అర్ణవము | అర్నవము | నిర్ణయము | నిర్నయము |
| కర్ణుఁడు | కర్నుడు | సంపూర్ణము | సంపూర్నము |
| చూర్ణము | చూర్నము | చూర్ణిక | చూర్నిక |
| వర్ణము | వర్నము | జీర్ణము | జీర్నము |

౧౯. ల ళ లను గుర్తించి వ్రాయవలెను.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| కాలము | కాళము | విలాసము | విళాసము |
| కలకలము | కళకళము | కళపెళకాగు | కలపెల కాగు |
| లలితకళలు | లలితకలలు | పగటి కలలు | పగటి కళలు |
| ఆదితాళము | ఆదితాలము | తాళపుఁజెవి | తాలపుఁజెవి |
| కలికాలము | కళికాలము | కాళికాదేవి | కాలికాదేవి |
| సమకాలికము | సమకాళికము | మూలము | మూళము |
| వెళ్ళుము | వెల్లుము | వెల్లువ | వెళ్ళువ |
| మంగళము | మంగలము | పొంగలి | పొంగళి |

గమనిక : ప్రళయ కళాది శబ్దములు సంస్కృతములో ప్రలయ కలాది రూపములుగా వ్రాయఁబడినను తెనుఁగులో ళకారయుక్తముగా వ్రాయుటయే లెస్స.

౨౦. శ ష స లను తార్మాఱు చేయరాదు.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| శర్కర | షర్కర | ఆషాఢము | ఆశాఢము |
| శాంతి | షాంతి | పుష్పము | పుస్పము |
| భాష | బాశ | శరీరము | సరీరము |
| ప్రకాశము | ప్రకాషము | వేషము | వేశము |
| శంకరుఁడు | షంకరుఁడు | వృషభము | వృశభము |
| సైనికుఁడు | శైనికుఁడు | ఆశ | ఆష |
| ఘోష | ఘోశ | దోసిలి | దోశిలి |
| చేసెను | చేశెను | వాసెన | వాశెన |

౨౧. హ కారమున కితర హల్లులు చేరినప్పుడు పరిశీలించి వ్రాయవలసి యుండును.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| బ్రహ్మ | బ్రంహ్మ | ప్రహ్లాదుఁడు | ప్రల్హాదుఁడు |
| నరసింహ | నరసింహ్మ | జిహ్వ | జింహ్వ |

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| ఆహ్నికము | ఆన్హికము | (ఉచ్చారణ మిట్లే చేయఁదగును) | |
| కల్హారము | కహ్లారము | వహ్ని | వన్హి (ఉచ్చారణమిట్లే) |

౨౨. 'క్ష' ను 'చ్ఛ' గా వ్రాయరాదు.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| రక్షించెను | రచ్ఛించెను | పరీక్ష | పరీచ్ఛ |
| పక్షి | పచ్ఛి | వక్షస్థలము | వచ్ఛస్థలము |
| ముముక్షువు | ముముచ్ఛువు | తత్క్షణము | తచ్ఛణము |

౨౩. 'త్య'ను 'చ్ఛ, చ్య'గాను 'ద్య'ను 'జ్జ, జ్య'గాను వ్రాయుట సరికాదు.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| ముత్యము | ముచ్ఛము | మత్స్యము | మచ్ఛము |
| | ముచ్యము | | మచ్యము |
| నిత్యము | నిచ్ఛము | కృత్యము | కృచ్ఛము |
| | నిచ్యము | | కృచ్యము |
| వైద్యము | వైజ్జము | నైవేద్యము | నైవేజ్జము |
| | వైజ్యము | | నైవేజ్యము |
| మద్యము | మజ్జము | పాద్యము | పాజ్జము |
| | మజ్జ్యము | | పాజ్యము |

౨౪. ఇంక-చాల మొదలైన వానిని దీర్ఘములుగా వ్రాయరాదు.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| ఇంక | ఇంకా | చాల | చాలా |
| అందాఁక | అందాఁకా | కూడ | కూడా |

౨౫. ని-ను, కి-కు ప్రత్యయములను సరిగా వాడవలెను.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| అమ్మను | అమ్మని | బిందెను | బిందెని |
| హరిని | హరిను | తల్లిని | తల్లిను |
| కొడుకునకు | కొడుకుకు, కొడుకునకి | వదినెకు | వదినెకి |

౨౬. క్రియల చు-పు వర్ణములను తారుమారుగా నుపయోగింపఁ జనదు.

| ఒప్పు | తప్పు | ఒప్పు | తప్పు |
|---|---|---|---|
| రక్షింపన్ | రక్షించన్ | రక్షింపక | రక్షించక |
| రక్షింపఁడు | రక్షించఁడు | రక్షింపుము | రక్షించుము |
| పఠింపించు | పఠించించు | పఠింపఁబడు | పఠించఁబడు |

౨౭. ఆత్మనేపద ధాతువులోని కొను నకు క కారము నాదేశము చేయరాదు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| వండుకొని తినెను | వండుక తినెను |
| తీసికొని పోయెను | తీసుక పోయెను |
| ఈఁదుకొని వచ్చెను | ఈఁదుక వచ్చెను |

—o—

# ౧౨. సంధులు

## సంధి స్వరూపము

వర్ణము లొండొంటితోఁ జేరుటను సంధి యందురు. సంధివచ్చినపుడు వర్ణములు గొన్ని యెడల లోపించును. కొన్నిచోట్ల వాని ప్రక్కన వేరొక వర్ణము వచ్చి చేరును. కొన్ని తావుల నావర్ణములకు బదులుగా మఱియొక వర్ణము వచ్చును. సమాసమున సంధి నిత్యము. వాక్యమున వివక్షాధీనము. సంస్కృత సంధులనియుఁ, దెలుఁగు సంధులనియు నివి రెండు విధములు. కేవలము సంస్కృత పదములలోని వర్ణములకు వచ్చు సంధులు సంస్కృత సంధులు. తెలుఁగు పదముల వర్ణములకు వచ్చు సంధులు తెలుఁగు సంధులు. తత్సమ తద్భవ దేశ్యాదులన్నియుఁ దెలుఁగు పదములనియే వ్యవహరింపఁబడును. తెలుఁగు భాషలో సాధారణముగా వాడుకొనఁబడునట్టి సంస్కృత పదములలోఁ గన్పడు సంధు లివి.

## ౧. సంస్కృత సంధులు

ఇవి స్వరసంధులనియు, హల్సంధు లనియు నిరు దెఱఁగులు.

### స్వరసంధులు

సూచన: వర్ణముల స్థానమున వచ్చిన ఆదేశము; వర్ణముల ప్రక్కనఁ జేరిన ఆగమము అని యెఱుంగునది.

౧. సవర్ణ దీర్ఘ సంధి: అ, ఇ, ఉ, ఋ, వర్ణములకు సవర్ణమైన స్వరము పరమగునపుడు రెంటికిని దీర్ఘముఆదేశముగా వచ్చును. (వర్ణమనఁగా హ్రస్వదీర్ఘములు రెండునని గ్రహింపవలెను.)

ఉదా: క్షీర+అబ్ధి = క్షీరాబ్ధి; రవి+ఇంద్రుఁడు = రవీంద్రుఁడు; మృదు+ఉక్తి = మృదూక్తి; పితృ+ఋణము =పితౄణము.

ఇట్లే దీర్ఘములకును ఉదాహరణములు గ్రహించునది.

౨. గుణసంధి : అవర్ణమునకు ఇ, ఉ, ఋ, వర్ణములు పరమగునపుడు వరుసగా ఏ, ఓ, అర్ అనునవి యేకాదేశముగా వచ్చును.

ఉదా : బుధ+ఇంద్రుఁడు,=బుధేంద్రుఁడు, సూర్య+ఉదయము =సూర్యోదయము, బ్రహ్మ+ఋషి=బ్రహ్మర్షి.

౩. వృద్ధిసంధి: అ వర మునకు ఏ, ఐ లు పరమగునపుడు ఐకారమును, ఓ ఔ లు పరమగునపుడు ఔ కారమును ఆదేశ మగును.

ఉదా : భీష్మ + ఏకాదశి = భీష్మైకాదశి. పరమ + ఐశ్వర్యము = పరమైశ్వర్యము. వన + ఓషధి = వనౌషధి, శబ్ద + ఔచిత్యము = శబ్దౌచిత్యము.

౪. యణాదేశసంధి: ఇ, ఉ, ఋ వర్ణములకు సవర్ణముకాని యచ్చు పరమగునపుడు వరుసగా య్, వ్, ర్ లు ఆదేశముగా వచ్చును.

ఉదా : అతి + అవసరము = అత్యవసరము, విష్ణు + ఆలయము = విష్ణ్వాలయము, మాతృ + ఆదేశము = మాత్రాదేశము.

## హల్సంధులు

౧. శ్చుత్వసంధి: స కార తవర్గములకు శవర్ణ చవర్గములు పరమగునపుడు క్రమముగా శవర్ణము, చవర్గము నాదేశము లగును.

ఉదా :మనస్ + శాంతి = మనశ్శాంతి;దుస్+చింత=దుశ్చింత మరుత్+చలనము = మరుచ్చలనము మొదలైనవి.

౨. ష్టుత్వసంధి: స కార తవరములకు షకార టవర్గములు పరమగునపుడు క్రమముగా షకారము, టవర్గము నాదేశ ము లగును.

ఉదా : చతుస్+షష్టికళలు = చతుష్షష్టికళలు; ధనుస్ = టం కారము = ధనుష్టంకారము; చలత్ + డమరుకము =చలడ్డమరుకము

౩. జశ్త్వసంధి: క చ ట త ప లకు అచ్చులుగాని ఘోష వర్ణములుగాని పరమైనపుడు గ జ డ ద బ లు వరుసగా వచ్చును.

(ఘోష వర్ణములనగా కఖ, చఛ, టఠ, తథ పఫ, శ, ష, సలు కాక తక్కినవి.)

ఉదా : వాక్ + ఆరంభము = వాగారంభము; అచ్ + అం తము = అజంతము; షట్ + అంగములు = షడం గములు; సుహృత్ + దర్శనము = సుహృద్దర్శనము; చిత్ + రూపము = చిద్రూపము; చలత్ + వనము= చలద్వనము మొదలైనవి.

౪. అనునాసిక సంధి: క చ ట త ప లకు అనునాసికాక్షర ములు పరమగునపుడు ఆయా వర్గమున పంచమాక్షరము వికల్పముగా వచ్చును. అనునాసికాక్షర మాదియందుఁ గల ప్రత్యయము పరమైనపుడు నిత్యముగా వచ్చును.

ఉదా : వాక్ + మాధుర్యము = వాఙ్మాధుర్యము, వాగ్మాధు ర్యము. విద్యుత్ + మాల = విద్యున్మాల, విద్యు ద్మాల. మరుత్ + నందనుఁడు = మరున్నందనుఁడు, మరుద్నందనుఁడు. వాక్ + మయము = వాఙ్మ యము. తత్ + మాత్రము = తన్మాత్రము.

పరసవర్ణ సంధి: తకారమునకు లకారము పరమగు నపుడు లకారము వచ్చును.

ఉదా : సంపత్ + లాభము = సంపల్లాభము.

౭. పూర్వసవర్ణ సంధి: క చ ట త ప లకంటె పరమైన హకారమునకు పూర్వసవర్ణము వచ్చును.

ఉదా : వాక్ + హని = వాక్ ఘని = వాగ్ఘని. ధావత్ + హయము = ధావత్ + ధయము = ధావద్ధయము.

౮. చత్వసంధి: క చ ట త ప లకంటె పరమైన శవర్ణము నకు కొన్ని వర్ణములు పరమైనపుడు ఛ కారము వికల్పముగా వచ్చును.

ఉదా : వాక్ + శరములు = వాక్ఛరములు. వాక్శరములు. తత్ + శాంతి = తచ్ఛాంతి తచ్శాంతి.

౯. చకారాగమసంధి: అజంత పదమునకు ఛ కారము పరమగునపుడు చ్ ఆగమ మగును. దీర్ఘాంతపదమున కిది వికల్పముగా నగును.

ఉదా : శ్వేత + ఛత్రము = శ్వేతచ్ఛత్రము: లక్ష్మీ + ఛాయ = లక్ష్మీచ్ఛాయ

౯. విసర్గసంధి: పదాంత మందలి స కారమునకు క–ఖ లు పరమగునపుడును, ప–ఫ లు పరమగునపుడును విసర్గము వచ్చును.

ఉదా : ఉషస్ + కాలము = ఉషఃకాలము; అయస్ + ఖండము = అయఃఖండము; వయస్ + పరిణామము = వయఃపరిణామము; మనస్ + ఫలకము= మనఃఫలకము.

౧౦. సకారాదేశసంధి: (అ) అకారముకంటె పరమైయున్నట్టిదియు, అవ్యయసంబంధము కానిదియు నైన విసర్గమునకు కృ–కమ్ ధాతువులనుండి పుట్టిన శబ్దములును, కంస,

కుంభ, పాత్ర కుశ, కర్ణి శబ్దములును పరమందుండఁగా సకారము నిత్యముగా సాదేశ మగును.

ఉదా: యశః+కారుఁడు=యశస్కారుఁడు. వయః + కాముఁడు=వయస్కాముఁడు: అయః+కంసము= అయస్కంసము మొదలైనవి.

పురః. నమః అనువానికిఁగూడ ఇట్లే వచ్చును.

ఉదా: పురస్కరణము నమస్కారము.

## ౨. తెలుగు సంధులు

౧. అకారసంధి: అత్తునకు అచ్చు పరమగునప్పుడు సంధి వికల్పముగా నగును. సంధిలేనిచోట స్వరముకంటె పర మైన స్వరమునకు యడాగమ మగును.

పూర్వపరస్వరములకు పరస్వర మేకాదేశ మగుట సంధి యనఁబడును.

ఉదా : మేన+అల్లుఁడు=మేనల్లుఁడు; మేనయల్లుఁడు.

స్త్రీవాచక తత్సమ సంబోధనాంతముల కీ సంధి రాదు.

ఇకారసంధి: (అ) ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పి కముగా నగును. ఏమి, ఏది, ఏవి, మఱి, అది, అవి, ఇది, ఇవి, కిన్ (షష్ఠీప్రత్యయము)-ఇవి యేమ్యాదులు.

ఉదా: ఏమి+అన్నాఁడు=ఏమన్నాఁడు ఏమియన్నాఁడు.

(ఆ) క్రియాపదములం దికారమునకు సంధి వికల్పముగా వచ్చును.

ఉదా: వచ్చిరి+అందఱు=వచ్చిరందఱు. వచ్చిరి యందఱు.

(ఇ) మధ్యమ పురుష క్రియలం దిత్తునకు సంధి యగును.

ఉదా: పుట్టితివి+అచ్చట=పుట్టితి వచ్చట; వచ్చితిరి+ ఎప్పుడు=వచ్చితి రెప్పుడు.

(ఈ) క్త్వార్థేకారమునకు సంధి లేదు.

వచ్చి-పోయి మొదలైన యసమాపక క్రియలలోని ఇకారమే క్త్వార్థేకార మనఁబడును.

ఉదా: వచ్చి+ఇచ్చెను=వచ్చి యిచ్చెను.

3. ఉకారసంధి: (అ) ఉత్తున కచ్చుపరమైనపుడు సంధి యగును.

ఉదా: రాముఁడు+అతఁడు=రాముఁడతఁడు.

(ఆ) ద్వితీయాది విభక్తులందును, వచ్చుచున్-పోవుచున్వంటి వర్తమాన కర్త్రర్థక పదములందున్న ఉ (ఉన్) కారము నకును సంధి వికల్పముగా నగును.

ఉదా: నన్నున్+అడిగెను=నన్నడిగెను. నన్నునడిగెను.
చూచుచున్+ఉండెను=చూచుచుండెను. చూచుచు నుండెను.

ఆమ్రేడిత సంధి: అచ్చునకు ఆమ్రేడితముపరమగునపుడు సంధి తఱచుగ నగును.

ఒక శబ్దమునే రెండు పర్యాయములు పలుకఁగా, అందలి రెండవ పదమునకే యామ్రేడిత మని పేరు.

ఉదా : ఆహా+ఆహా=ఆహాహా. ఓహోహో, ఔరౌర.

ద్విరుక్తటకారాదేశము: (అ) కుఱు, చిఱు, కడు, నిడు, నడు శబ్దముల ఱ డ లకు అచ్చుపరమగునపుడు ద్విరుక్త టకార మగును.

ఉదా : కుఱు+ఉసురు=కుట్టుసురు. ఇట్లే చిట్టెలుక కట్టెదురు నిట్టూరుపు, నట్టిల్లు మున్నగునవి.

(ఆ) ఆమ్రేడితము పరమగు నపుడు కడాదుల తొలి యచ్చు మీది వర్ణములకెల్ల అదంతంబగు ద్విరుక్త టకార మగును.

ఉదా : పిడుగు + పిడుగు=పిట్టపిడుగు, కడ+కడ=కట్టకడ.

౬. గసడదవాదేశము: (అ) ప్రథమ మీఁది పరుషములకు గ స డ ద వ లు బహుళముగా నగును.

ఉదా : వాఁడు+కొట్టెను=వాఁడుకొట్టెను. వాఁడు గొట్టెను. వెంకన్న + చెప్పెను = వెంకన్న చెప్పెను. వెంకన్న సెప్పెను మొదలైనవి.

(ఆ) ద్వంద్వ సమాసమునఁ బదము మీఁది పరుషములకు గ స డ ద వ లగును.

ఉదా : కూర + కాయలు = కూరగాయలు ఇట్లే కాలు సేతులు, టక్కుటెక్కులు, తల్లిదండ్రులు, ఊరువల్లెలు

౭. సరళాదేశము—బిందుసంశ్లేషములు;

(అ) ద్రుత ప్రకృతికముమీఁది పరుషములకు సరళములగును.

(ఆ) ఆదేశ సరళములకు ముందున్న ద్రుతములకు బిందు సంశ్లేషలు విభాష నగును.

ఉదా : విచ్చెను + కలువలు = విచ్చెనుగలువలు. విచ్చెఁ గలువలు, విచ్చెంగలువలు, విచెన్గలువలు,ఇట్లే తక్కినవి.

౮. పు—ంపు ఆదేశము: కర్మధారయమునందు ము వర్ణము నకు పు—ంపు లగును.

ఉదా : సరసము + మాట= సరసపుమాట, సరసంపుమాట.

౯. టు గాగమము : (అ) కర్మధారయమునం దుత్తున కచ్చు పరమగునపుడు టు గాగమ మగును.

ఉదా : కఱకు + అమ్ము = కఱకుటమ్ము

(ఆ) కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పర మగునపుడు టు గాగమము విభాషనగును.

ఉదా : పేరు+ఉరము=పేరుటురము, పేరురము. చిగురుటాకు, చిగురాకు పొదరుటిల్లు, పొదరిల్లు

౧౦. రుగాగమము: (అ) కర్మధారయమున పేదాదిశబ్దములకు ఆలు శబ్దము పరమగు నపుడు రు గాగమ మగును.

ఉదా : పేద+ఆలు=పేదరాలు. బీదరాలు మొ.

(అ) కర్మధారయమునఁ దత్సమంబులకు ఆలుశబ్దము పరమగు నపు డత్వమున కుత్వమును, రు గాగమము నగును.

ఉదా : ధీర+ఆలు=ధీరురాలు గుణవంతురాలు మొ.

౧౧. ను గాగమము: ఉదంతమగు తద్ధర్మార్థ విశేష సమాసము నకును, షష్ఠీ సమాసమునందున్న ఉ కార ఋ కార ములకును అచ్చు పరమగు నపుడు ను గాగమ మగును.

ఉదా : చేయు+అతఁడు = చేయునతఁడు, రాజు + ఆజ్ఞ = రాజు నాజ్ఞ, విధాతృ + ఆనతి = విధాతృ నానతి.

౧౨. తొలియచ్చు మీఁది వర ములకు లోపము, ను గాగమము

(అ) సమాసమునఁ బ్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపము బహుళముగా నగును.

(అ) లుప్తశేషమునకుఁ బరుషములు పరమగునపుడు నుగాగమ మగును.

ఉదా : ప్రాఁత + ఇల్లు = ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు. లేదూడ. లేఁతదూడ, ప్రాఁత + కెంపు = ప్రాఁగెంపు; ఇట్లే లేఁగొమ్మ; పూఁదోఁట.

౧౩. హల్ ద్విత్వము. అ-ఈ-ఏల మీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వము బహుళముగా నగును. అట్టిచో ఆ-ఈ-ఏ హ్రస్వము లగును.

ఉదా : ఆ+ కాలము = అక్కాలము: ఈ+చోటు=ఇచ్చోటు; ఏ+కడ=ఎక్కడ.

——

# ౧౩. సమాసములు

## సమాస స్వరూపము

౧. విడివిడిగా నాయా యర్థములను బోధింప సమర్థములైన పదములు రెండుగాని యంతకంటె నెక్కువగాని చేరి యొక పెద్ద పదముగా నగుటయే సమాసము.

అట్లు చేరిన పదముల సమూహరూపమైన సమాసమున కందు సమసించిన పదముల యర్థమును గలుపుకొని విలక్షణమైన యొక సముదాయార్థమును బోధించు శక్తియుండును. సమాసముగా నగునపుడు ప్రత్యేకపదములమీఁది విభక్తి ప్రత్యయములు లోపించిపోవును సమాసము పిదనే తిరిగి విభక్తులు వచ్చును. విభక్తులు లోపింపని సమాసములు కొన్ని కలవు. 'అలుక్సమాసము'లని పేరు.

సమాసముయొక్క యర్థమును బోధించు వాక్యమునకు విగ్రహ వాక్యమని పేరు.

౨. సాంస్కృతి కాచ్ఛిక మిశ్ర భేదముచే సమాసము త్రివిధము.

(అ) సంస్కృత శబ్దముల సమాసము సాంస్కృతికము. సంస్కృత భాషలోనే సమాసముగా నేర్పడి తెలుఁగులో వాడుకొనఁబడునది.

రాజపురుషుఁడు మొదలైన యిట్టివి. వీనిని సిద్ధసమాసము లందురు.

(ఆ) తెలుఁగు పదములతోనే యేర్పడినది ఆచ్ఛిక సమాసము.

తేనియానతి; చెలువునీరు మొదలైనవి.

(ఇ) అచ్చ తెలుఁగు పదములును, తత్సమ పదములును గలిసి యేర్పడు సమాసము మిశ్రసమాస మనఁబడును.

రాజు ముదల; చెలువు నుదకేము.

(ఈ) సంస్కృత సమముల సమాసమునకు సాధ్యసమాస మని పేరు.

రాజునాజ్ఞ, లక్ష్మీవల్లభుఁడు మున్నగునవి.

(ఉ) కేవల సంస్కృత శబ్దము వికృతి శబ్దముతోడ సమసింపదు.

కావున శుద్ధతప్పు; అనేకమంది; వృక్షకొమ్మ - ఈ విధముగా సమాసములు సేయరాదు. కొందఱు మహాకవు లిట్టివి ప్రయోగించి యున్నారు. భాషలోఁ జేరిపోయిన యిట్టివి ప్రయోగింప వచ్చును.

ఉదా : కపిల కన్నులు. జీవగఱ్ఱ, ప్రాణగొడ్డము, దినవెచ్చము, దీపకంబము, అపదూఱు మొదలైనవి

౩. అర్థప్రాధాన్యమును బట్టి యీ సమాసములు నాలుగు విధములు : అవ్యయీభావము; తత్పురుషము; బహువ్రీహి; ద్వంద్వము.

## అవ్యయీభావము

• అవ్యయార్థమునకు ప్రాధాన్యముగలది అవ్యయీభావము.

ఉదా : యథాశక్తి; ప్రతి గృహము; ఆబాలగోపాలము.

## తత్పురుషము

౫. ఉత్తర పదార్థ ప్రధానము తత్పురుషము.

ఏ సమాసమున రెండవ పదము నర్థమునకుఁ బ్రాధాన్యముండునో యది తత్పురుష మని గ్రహింపవలెను.

(అ) ద్వితీయాది విభక్త్యంత పదములకు మీఁది పదముల తోడ సమాసము తత్పురుష మనఁబడును. ఇట్టివి యాయా విభక్తుల పేళ్ళతో ద్వితీయా తత్పురుషము,

తృతీయా తత్పురుషము మొదలైనవిగా వ్యవహృతము లగును.

| | |
|---|---|
| ఉదా : ద్వి. ౧. కృష్ణాశ్రితుఁడు | కృష్ణుని ఆశ్రయించినవాఁడు |
| ౨. నెలదాల్పు | నెలను-చంద్రుని-దాల్చినవాఁడు |
| తృ. ౧. భూతబలి | భూతము కొఱకు బలి |
| ౨. దూడగడ్డి | దూడకొఱకు గడ్డి |
| పం, ౧. చోరభయము | చోరుల వలన భయము |
| ౨. కలిమిగరువము | కలిమి వలన గరువము |
| ష. ౧ సీతాపతి | సీతయొక్క పతి |
| ౨. చెట్టునీడ | చెట్టుయొక్క నీడ |
| స ౧ యుద్ధధీరుఁడు | యుద్ధమునందు ధీరుఁడు |
| ౨. వేల్పు పెద్ద | వేల్పులయందు పెద్ద |

(అ) ఈ తత్పురుష సమాసములో కర్మధారయము, ద్విగువు, నఞ్ సమాసము అని మరికొన్ని భేదములు గలవు.

కర్మధారయము :

విశేషణపదము విశేష్యపదముతో సమసించిన కర్మధారయమగును. ఇదియు విశేషణపూర్వపద మనియు విశేషణోభయపద మనియు, ఉపమానపూర్వపద మనియు, ఉపమానోత్తరపద మనియు, సంభావనా పూర్వపద మనియు, అవధారణాపూర్వపద మనియును బెక్కువిధములుగా నున్నది.

౧. విశేషణ పూర్వపదకర్మధారయము : నీలోత్పలము, నల్లకలువ.

* ఆ-ఈ-ఏ యనునవి విశేషణముగా నున్నచోట్ల వీనికిఁ బరమగునట్టి యసంయుక్త హల్లునకు ద్విత్వము, వీనికి హ్రస్వము వచ్చును.

ఉదా : ఆ+కన్య=అక్కన్య. ఎవ్వాఁడు, ఎచ్చోటు.

* గుణవచనములైన నల్లాదులకు కర్మధారయమున ని వర్ణము వికల్పముగా వచ్చును.

ఉదా : నల్లనికలువ.

౨. విశేషణోభయపద కర్మధారయము : స్నాతానులిప్తుఁడు, ఎత్తుపల్లము.

౩. ఉపమానపూర్వపద కర్మధారయము : మేఘశ్యాముఁడు, చిగురుఁగేలు.

౪. ఉపమానోత్తరపద కర్మధారయము : ముఖపద్మము, మోముదామర.

౫. సంభావనాపూర్వపద కర్మధారయము . వింధ్య పర్వతము, మామిడిచెట్టు.

౬. అవధారణాపూర్వపద కర్మధారయము : విద్యాధనము.

ద్విగువు :

సంఖ్యావాచకశబ్దము పూర్వమందున్న కర్మధారయము ద్విగు వనఁబడును.

ఉదా : సప్తసముద్రములు - నాలుగు దెసలు

* మూఁడు అను పదముతో వచ్చిన ద్విగువులో డు వర్ణమునకు లోపము, మీది హల్లునకు ద్విత్వము వచ్చును.

మూఁడు+జగములు=ముజ్జగములు.

నఞ్ తత్పురుషము :

నవర్ణముతోడి సమాసము నఞ్ సమాస మనఁబడును.

ఇట్టిచోట్ల న వర్ణమునకు హల్లుపరమగునపుడు 'అ' కారమును అచ్చుపరమగునపుడు 'అన్' ఆదేశ మగును.

న+విద్య=అవిద్య, న+అశ్వము=అనశ్వము.

## బహువ్రీహి

౬. అన్యపదార్థ ప్రధానము బహువ్రీహి.

సమసించు పదములలో దేనియర్థమునకుఁ బ్రాధాన్యములేక వాని కలయిక చేఁ జెప్పఁబడిన యన్యపదార్థమునకే యిందుఁ బ్రాధాన్యముండును

ఉదా : పీతాంబరుఁడు. చక్కంటి, చక్రపాణి (వ్యధికరణ బహువ్రీహి) సువర్ణాభరణము (వికార బహువ్రీహి) ద్విశతము అభ్యాస బహువ్రీహి) సపుత్రుఁడు (సమసంబంధ బహువ్రీహి) దక్షిణపూర్వము (దిగంతరాళ బహువ్రీహి) కేశాకేశి (వ్యతీహార బహువ్రీహి).

## ద్వంద్వము

౭. ఉభయపదార్థ ప్రధానము ద్వంద్వము.

సమసించు రెండు పదములకును సమప్రాధాన్యము గలది ద్వంద్వమగును.

ఇది యితరేతరయోగ ద్వంద్వ మనియు, సమాహార ద్వంద్వ మనియు రెండు విధములు.

౧. ఇతరేతరయోగ ద్వంద్వము: సీతారాములు, తల్లిదండ్రులు.

౨ సమాహార ద్వంద్వము : పాణిపాదము, భేరీపటహము, గోవ్యాఘ్రము.

## అలుక్సమాసము

౮. సమసించు పదములమీఁది విభక్తి ప్రత్యయములు లోపింపనిచో నది యలుక్సమాస మనఁబడును.

ఉదా : జనుషాంధుఁడు, యుధిష్ఠిరుఁడు. కంఠేకాలుఁడు, దేవానాంప్రియుడు, సీతోడి చెలిమి, నావలని నేరము.

———

# ౧౪. అలంకారములు

## స్వరూపము

శరీరమునకు నగలు సౌందర్యమును పెంపుచేయునట్లు కావ్యమున కలంకారములు శోభాతిశయమును గూర్చును. భాషతోనే యలంకారములు పుట్టిన వనదగును. తాను జెప్పదలచిన విషయమును స్పష్టముగాను, చక్కగాను, శ్రోతకు సంతోషము గలుగునట్లును భాషింప యత్నించుట వక్తకు స్వభావము. ఆ విధముగా భాషలో నేర్పడియున్న పలుకుబడులనే కావ్యతత్వజ్ఞులు వేఱువేఱుగా నేర్చి కూర్చి యాయా యలంకారములుగా బేర్లుపెట్టి స్వరూపములను నిర్వచించినారు. భరతమహర్షినాడు నాలుగు సంఖ్యలో నున్న యీ యలంకారములు రానురాను అప్పయదీక్షితుల నాటికి ౧౧౫ వఱకును బెరిగినవి ఇవి శబ్దప్రాధాన్యమునుబట్టి శబ్దాలంకారము లనియు, అర్థప్రాధాన్యమునుబట్టి యర్థాలంకారము లనియు రెండు విధములు

## శబ్దాలంకారములు

**ఛేకానుప్రాసము :**

> స్వరసహితములగు రెండేసి వ్యంజనములజంటలకు వ్యవధానము లేకుండగ నావృత్తి గలిగిన 'ఛేకానుప్రాస' మగును.

ఛేకు లనగా పండితులు. వారికి ప్రియమైన యనుప్రాసము ఛేకానుప్రాసము.

**ఉదా :** 'రాజ రాజత్పదాంభోజ! సద్గుణరాజి రాజిత శ్రుతిమౌళి రాజమాన! నీకుగై మోడ్పు.'

వృత్త్యను ప్రాసము :

సంఖ్యానియమము లేక యొక యక్షరమునకే గాని, రెండక్షరములకే గాని, మూఁడక్షరములకే గాని యావృత్తి గలిగినచో 'వృత్త్యనుప్రాస' మగును.

ఉదా : ''పాలు ప్రాలేయాలజాలు మేలగు మల్లెపూలు వెన్నెలలు ముత్యాల శ్రీలు సృష్టిసామగ్రిగాఁగ సృష్టించె ధాత త్వద్యశము రామః''

* లాటాను ప్రాసము :

ఒకానొక తాత్పర్య విశేషము దోఁచుచు శబ్దములు పునరుక్తము లగునేని 'లాటాను ప్రాస' మగును.

ఉదా : జానకీపతి నెంచు శబ్దంబు శబ్దంబు, చక్రపాణి వచించు శక్తి శక్తి."

 యమకము :

అర్థభేదము గలుగు స్వరసహితములగు వ్యంజన సముదాయమున కావృత్తి కలిగిన 'యమక' మగును.

ఉదా : "పొగడొందు నేరాజు నగరాజ నగరాజ సముఁడన దాన సారముల యందు."

ఇట్లే : పునరుక్తవదాభాసము, ముక్తపదగ్రస్తము మున్నగు శబ్దాలంకారములను గుర్తించునది.

## అర్థాలంకారములు

సూచన : వర్ణింపఁదలచిన వస్తువు ఉపమేయము. దేనితో బోల్తుమో యట్టిది ఉపమానము.

---

* గుజరాతులోఁ గొంత ప్రదేశమునకు లాటమని పేరు. అందలి జనుల కీ యలంకార మెక్కువ ప్రియమైనందున దీని కీ పేరు వచ్చినది కమలాక్షు నర్చించు కరములు కరములు'అను పోతనార్యుని పద్యమిట్టిదే.

౧. ఉపమాలంకారము : ఉపమానమునకును, ఉపమేయము నకును సామ్య మెచ్చట వర్ణింపఁబడునో యది యుపమాలంకార మగును.

ఉదా : "ఓ కృష్ణా! నీ కీర్తి హంసివలె నాకాశగంగలో విహరించు చున్నది." ఇచ్చట హంసి యుపమానము, కీర్తియుపమేయము. ఈ రెంటికిని సామ్య మాకాశ గంగలో విహరించుట. "వలె" అనునది యుపమావాచకము. ఇది పూర్ణోపమ. వీనిలోఁ గొన్ని లోపించిన లుప్తోపమ యందురు.

౨. అనన్వయాలంకారము : 'దీనితోఁబోల్పఁ దగినది రెండవది లే' దను నభిప్రాయము వచ్చునట్లు ఒక వస్తువునందే యుపమానోపమేయ భావకల్పనముఁ జేసి వర్ణించినచో అనన్వయాలంకార మగును.

ఉదా : శ్రీరామచంద్రుని శౌర్యదీప్తికి శ్రీరామచంద్రుని శౌర్యదీప్తియే సాటి.

౩. రూపకాలంకారము : ఉపమేయమున కుపమానముతో నభేదమునుగాని, తాద్రూప్యమునుగాని వర్ణించిన రూపక మగును.

ఉదా : (౧) సింహాసనోదయగిరిపై రామభానుబింబము దోఁపఁగనే సజ్జన ముఖ పద్మములు వికసించెను. ఖలనేత్ర కైరవములు ముకుళించెను.

(౨) ఈ జోదు మూఁడవ కన్నులేని రుద్రుఁడే.

౪. సందేహము : కవిసమ్మతమైన సాదృశ్యము వలన నుపమానోపమేయములు సందేహమునకు విషయములైన సందేహాలంకారము.

ఉదా : అంబుదశ్యాముఁడగు నీరాఘవుని ప్రక్కనున్నది సీతయా? నిలుకడ నేర్చిన మెఱుపుఁ దీఁగెయా?

౫. అపహ్నవము : ఉపమేయమును గాదని నిషేధించి యందు సామ్యమున నుపమానారోపము చేసిన నపహ్నవాలంకార మగును.

ఉదా : ఇది చంద్రబింబముకాదు; వియద్గంగలో వికసించిన వెల్లదామర పువ్వు

ఉత్ప్రేక్షాలంకారము : ఉపమాన ధర్మ సంబంధము వలన నుపమేయ ముపమానముగానే సంభావింపఁ బడిన (ఊహింపఁబడిన) నుత్ప్రేక్ష యగును. ఈ యుత్ప్రేక్ష వస్తు-హేతు-ఫల రూపమున మూఁడు విధములుగా నుండును.

వలె, బహుశః, ఊహింతును, తలంతును, నిశ్చయము, అదియో యనునట్లు–మొదలగునవి యుత్ప్రేక్షా వాచకములు.

ఉదా : (౧) ఈ చీకటి చక్రవాకపక్షుల విరహాగ్నినుండి వెడలు పొగయో యన్నట్లున్నది.

(౨) మెత్తని నీ యడుగులు కఠిననేలపై నిడుటవలన నెఱ్ఱనైనవి, నిక్కము.

(౩, ఓ తపస్వీ ! బహుశః నీ పదముతో నైక్యము నొందుటకుఁ బద్మము నీటిలోఁ దపము చేయుచున్నది !

అతిశయోక్త్యలంకారము ; ఎచట కవి ప్రౌఢోక్తి వలన నుపమేయము మఱుఁగుపడిపోయి యుపమానమే ప్రధానముగా గోచరించునో యది యతిశయోక్తి. ఇదియైదు విధములు : ౧. భేదమున్నవానికి భేదము లేదని చెప్పుట. ౨. భేదము లేనివానియందు భేదమున్నదనుట. ౩. సంబంధము గలవానికి సంబంధము లేదని పల్కుట. ౪. సంబంధము లేనియెడ సంబంధమున్నదని

వచించుట. ౫. కార్యకారణముల పౌర్వాపర్యమును తాఱుమాఱుచేసి చెప్పుట.

౧. కాకతి కులాంబుధినుండి యావిర్భవించిన యీ కల్పశాఖి యర్థుల యాప్సితము లీడేర్చుచున్నది.

౨. ప్రతాపరుద్ర చక్రవర్తి గొప్పదనమే వేఱు, వాని నిండుదనమే వేఱు, వాని పరాక్రమమే వేఱు, వాని యఖిలార్థముఁ గ్రొత్తయే.

౩. అపూర్వగుణ సంపన్నుఁడగు నీ చలమర్తిగండని ముదిమది దప్పిన యా మొదటి వేల్పు సృజించి యుండఁడు.

౪. ఆ నగరమునందలి యేనుఁగు గున్నలపై నెక్కి మిన్నేటి పసిఁడి తామరపూవులను గోయవచ్చును. ఇఁక మత్తేభ మెట్లుండునో చెప్పవలయునా?

౫. ఓ రాజా ! నీ ప్రతాపాగ్ని పర్వకమున్నె శత్రురాజ పురములఁ బొగ లెగయు చున్నవి.

౮. దీపకాలంకారము : ప్రస్తుతాఽప్రస్తుతములకు ధర్మ సామ్యము చెప్పినచో దీపకాలంకార మగును.

ఉదా : ఏనుఁగు మదము చేతను, రాజు ప్రతాపము చేతను, విద్వాంసుఁడు వినయము చేతను ప్రకాశించును.

౯. దృష్టాంతాలంకారము : బింబ ప్రతిబింబ భావమున నుప మానోపమేయముల సాధర్మ్యమును వేఱువేఱుగ నిబద్ధిం చిన దృష్టాంతాలంకార మగును.

ఉదా : ఓ రాజా ! నీవే కీర్తిమంతుఁడవు. చంద్రుఁడే కాంతి మంతుఁడు.

౧౦. నిదర్శనాలంకారము : ఉపమానధర్మ ముపమేయమునకుఁ జెప్పఁగా నది యసంగతమై దానివలన నారెంటికిని బింబ

ప్రతిబింబ భావమున నౌపమ్య మాక్షిప్తమైన యెడల నిదర్శనాలంకార మగును.

ఉదా : నీ నేత్రయుగళము నల్లకలువల లీలను దాల్చుచున్నది.

౧౧. వ్యతిరేకాలంకారము : ఉపమానముకంటె నుపమేయమున కాధిక్యము వర్ణింపఁబడిన వ్యతిరేకాలంకార మగును.

ఉదా : ఆర్యులు కొండలవలె సమున్నతులు. కాని వారు స్వభావముచేఁ గోమలులు

౧౨. సహోక్త్యలంకారము : సహభావము జనరంజకముగా వర్ణింపఁబడెనేని సహోక్త్యలంకార మగును.

ఉదా : ఓ రాజా! నీ శత్రువులతోఁ గూడ నీ కీర్తి దిగంతములకుఁ బాఱెను.

౧౩. వినోక్త్యలంకారము ; ఏదే నొకటి లేకపోవుట వలన నా వస్తువునకు రమ్యతయో, యరమ్యతయో గల్గుచో, అది వినోక్తియగును.

ఉదా : పక్షక్షయములు లేకున్నచోఁ జంద్రుఁడు శ్రీరామ చంద్రుని మోముతో సాటియగును.

౧౪. సమాసోక్త్యలంకారము : వర్ణ్యమైన వస్తువు యొక్క విశేషణాది సామ్యము వలన నప్రకృతమగు వస్తువు స్ఫురించెనేని సమాసోక్తి యగును.

ఉదా : ప్రాచీముఖమును జంద్రుఁ డనురాగముతో ముద్దు పెట్టుకొనెను.

౧౫. పరికరాలంకారము : విశేషణములు సాభిప్రాయము లయ్యేనేని పరికరమగును.

ఉదా : లక్ష్మీనాథుఁడైన యీతఁడు మిము సిరులొసఁగి రక్షించును.

౧౬. శ్లేషాలంకారము : అనేకార్థములు వచ్చునట్లు వర్ణించిన శ్లేష యగును.

ఉదా : వరదుఁడును సర్వమంగళావాసమూర్తి
రాజమౌళి ప్రతాపాంక రాజితుండు
భూరితేజుఁడు విజితారి పురహరుండు
రుద్రసముఁ డౌర ! శ్రీవీరరుద్ర విభుఁడు.

౧౭. అప్రస్తుత ప్రశంసాలంకారము : అప్రస్తుతమగు నొక వస్తువును జెప్పుటవలన సారూప్యముగల ప్రస్తుతవస్తువు గమ్యమగునేని యది యప్రస్తుత ప్రశంస యగును.

ఉదా : ఓ తుమ్మెదలారా ! చేవలువోయి, చివుళ్లు, పువ్వులుఁ, దావులుఁ, గమ్మదేనియలు సున్న యైన వట్టిచెట్ల చుట్టును దిరుగుచున్నారేల? అదిగో ! కల్పవృక్షము డాయిం జనుఁడు. ఈప్సితము సేకూరును.

౧౮. వ్యాజస్తుత్యలంకారము : నిందచేత స్తుతిగాని, స్తుతిచేత నిందగాని తోచునట్లు చెప్పిన వ్యాజస్తుతి యగును.

ఉదా: ౧. పాపాత్ములను గూడ నీవు స్వర్గ మందఁ జేయుచున్నావు ఓగంగా! నీకు వివేకమేది?-(నిందచే స్తుతి)

౨. ఔరా! యీ ప్రతాపరుద్రుని శత్రువు లెంత సాహసికులు, జంకులేక సముద్రములఁ జొచ్చుచున్నారు. పిక్కబలము కొలఁది పర్వతములపై కెగఁబ్రాఁకుచున్నారే ! - (స్తుతిచే నింద.)

౧౯. ఆక్షేపాలంకారము : ఒకానొక విశేషాభిప్రాయమును సూచించుటకై ఉక్తవిషయమునే కాని వక్ష్యమాణ విషయమునేకాని నిషేధించినట్లు తోఁచురీతిని పల్కినను, వాచ్యమైన విధివలనఁ బ్రతిషేధము స్ఫురించినను ఆక్షేపమగును.

ఉదా : ౧. చంద్రుఁడా! ఒకతూరి చర్మన మిమ్ము - సరే. వద్దులే. ప్రియురాలి నెమ్మోము గలదు.

౨ నాథా! ప్రతాపరుద్ర చక్రవర్తితోఁ గయ్యము పెట్టుకొనిన బాగుగాఁ బెట్టుకొనును. ఇదిగో సేనను - నేఁటినుండియే యడవిలోఁ గాఁపుర మెట్లు చేయవలెనో నేర్చుకొందును.

౨౦. విరోధాభాసాలంకారము : పైకి విరోధముగాఁ దోఁచి యాలోచించి చూడఁగా నా విరోధము పరిహృతమగు నెడల విరోధాభాస మగును.

ఉదా. నీవు చతురాననుఁడవయ్యుఁ బురుషోత్తముఁడవై వెలుఁగొందుచున్నావు

౨౧. విషమాలంకారము : అననురూపములైన వానికి సంబంధము వర్ణించినను, కారణమునకు విరుద్ధమైన కార్యోత్పత్తి చెప్పినను, ఇష్టసిద్ధిగోరి ప్రయత్నింపఁగా నిష్టసిద్ధి గాకపోవుటయేగాక అనిష్టము దాఁపురించినను విషమ మగును.

ఉదా : ౧ ఓ రాజా పూవువలె మృదువైన యీతేఁడి శరీర మెక్కడ? వజ్రమువలె మిక్కిలి కఠినమైన నీ బాణ మెక్కడ?

౨ నీ నల్లని కత్తి తెల్లని కీర్తి నీనుచున్నది.

౩ భక్ష్యములబుట్ట యనుకొని పాముబుట్టను కొఱికి రంధ్రము చేసిన యెలుక దానిచే భక్షింపఁబడెను

౨౨. కారణమాలాలంకారము : పూర్వ పూర్వవస్తువు లుత్తరోత్తర వస్తువులకుఁ గారణములైనచోఁ గారణమాల యగును.

ఉదా : నీతిచేత సంపద, సంపదచేతఁ త్యాగము, త్యాగము చేత యశము గలుగును.

౨౩. యథాసంఖ్యాలంకారము ఒక క్రమమునఁ జెప్పిన వస్తువుల కా క్రమము ననుసరించియే యన్వయమును గూర్చినచో యథాసంఖ్య మగును. దీనినే క్రమాలంకారమనియు నందురు.

ఉదా ఓ రాజా కరుణను గాంభీర్యమునను బుద్ధిచాతురిని
దాతృతను నీకు చనజాక్షుఁడు సముద్రము బృహస్పతి
కర్ణుఁడు సాటిరారు

౨౪. అర్థాంతర న్యాసాలంకారము సామాన్యము విశేషముచేఁగాని, విశేషము సామాన్యముచేఁగాని సమర్థింపఁబడిన నర్థాంతర న్యాస మగును

ఉదా ఆంజనేయుఁడు సముద్రమును దాఁటెను ఆహా మహాత్ములకు దుష్కరమైన కార్యముగలదా?

౨౫. స్వభావోక్త్యలంకారము ఉన్నదున్నట్లుగాఁ గన్నులకుఁ గట్టినట్లు సహృదయోద్వేజకము గాని రీతిఁ జేయు జాతి గుణ క్రియా ద్రవ్యముల వర్ణనము స్వభావోక్తియగును.

ఉదా కికురించి పరువెత్తి యొకతీరు మెడఁద్రిప్పి
వెన్నంటు నీపైనఁ గన్నువెట్టి
అమ్మ పై బడెకి భయమ్మున వెనుమేను
మనుమేను నొదుగ గా నునిచి ముడిచి
ఇసుమంత కొఱికిన కసవు త్రోవల జార
మిఱు దప్పిక నెండు నోరు దెఱచి
వడి క్రేళ్ళు దూఁకుటఁ బుడమిపై నొక్కింత
మిక్కిలిగా మింటఁ జక్క బాఱు
పస్నిఁడిలే డిన్ని గుఱివెట్టి నొసలు ముడిచి
కంటి నవమోడ్చి వెంటాడి వింటఁ దొడుఁగ
ములుకునంగొట్టి యద్దాని బి‍కుమార్చె
రాము డాశ్రిత కల్యాణధాముఁ డౌర

---

# ౧౫. ఛందస్సు

## ౧ స్వరూపము

కావ్యము మూఁడు విధములు గద్యమయము పద్యమయము గద్యపద్యమయము నియమములేని వాక్యముల సమూహము గద్యకావ్యము పద్యము గణ యతి ప్రాసాది నియమములు గలది, నియమ సహితమైనది గావుననే పద్యము గానానుగుణమై వీనులకు విందు సేయుచుండును అట్టి పద్యరచనకుఁగల నియమములను తెల్పునది ఛందశ్శాస్త్ర మనఁబడును

## ౨. లఘు గురువులు

అక్షరములు లఘువులనియు గురువులనియు రెండు విధములు ఉచ్చరించుటకుఁ బట్టు కాలమునుబట్టి యీభేద మేర్పడినది

లఘువు ఒక చిటికె వేయుటకుఁ బట్టు కాలమును మాత్ర యందురు ఒకమాత్ర కాలములో నుచ్చరింప దగునవి లఘువు లనఁబడును ఇవియే హ్రస్వములు అ ఇ ఉ ఋ ఎ ఒ-వీనితోఁ గూడిన క కి కు మొదలైన హల్లులును లఘ్వక్షరములే యగును

గురువు (౧) రెండుమాత్రల కాలములో నుచ్చరింపఁదగు నక్షరములు దీర్ఘములు వీనినే గురువు లందురు ఆ ఈ ఊ ౠ ఏ ఐ ఓ ఔ-వీనితో జేరిన హల్లులు కా కీ కూ మొదలైనవి

(౨) పూర్ణబిందువు విసర్గము పొల్లుహల్లు ముందుగల యక్షరములును గురువు లగును అంకము దుఃఖము హరిన్

(౩) ద్విత్వాక్షరములకును సంయుక్తాక్షరములను వెనుకనున్న యక్షరములును గురువు లగును తల్లి పద్మము (అ్రదుచు వి్రదుచు ఎ్రదుచు నను చోమాత్రము సంయుక్త పూర్వములైనను గురువులుగాఁ బరిగణింపఁబడవు ) ఛందస్సులో వీనికి గుర్తులు

లఘువు=(I) గురువు=(U

## ౩. గ ణ ము లు

అక్షరముల సమూహము గణ మన బడును

(క) ద్వ్యక్షర గణములు  రెండక్షరములతో నేర్పడు గణములు

ద్వ్యక్షర గణములు

(౧) గలము (ఒక గురువు-ఒక లఘువు) తాత
హ గణ మనియు దీనికే పేరు  తల్లి

(౨) లగము (ఒక లఘువు-ఒక గురువు) హరిన్
వగణ మనియు దీని నందురు

(౩) గగము (రెండు గురువులు)  ఆహా

(౪) లలము (రెండు లఘువులు)  హరి

(చ) త్ర్యక్షరగణములు  మూడక్షరములతో నేర్పడు గణములు

త్ర్యక్షరగణములు

| | | |
|---|---|---|
| జగణము | ◡ | జొహారు |
| తగణము | ◡ ◡ | రాజాజ్ఞ |
| నగణము | | ఫలము |
| భగణము | ◡ | ప్రాణము |
| మగణము | ◡ ◡ ◡ | శ్రీ రామా |
| యగణము | ◡ ◡ | సురేఖా |
| రగణము | ◡ ◡ | సుందరీ |
| సగణము | ◡ | వరదా |

(ట) చతురక్షర గణములు  నాలుగక్షరములతో నేర్పడునవి

చతురక్షర గణములు

| | | |
|---|---|---|
| నలము | | మురహరి |
| నగము | ◡ | వనములో |
| సలము | ◡ \| | వనమాల |

| | | |
|---|---|---|
| భలము | — | పుస్తకము |
| భగురువు | — — | దాశరథీ |
| మలఘువు | — — — | దైత్యారాతి |
| తలము | — — | గోదావరి |
| తగము | — — — | గోపాలకా |
| రలము | — — | కృష్ణవేణి |
| రగము. | — — — | సార్వభౌమా |

(త) పంచాక్షర గణములు · అయిదక్షరములతో నేర్పడునవి పంచాక్షరగణములు.

| | | |
|---|---|---|
| నగగము | I — — | కుసుమచాపా |
| నహము | — | కలువపూవు |
| సలలము | — | యమునానది |
| సవము | — — | పరమేశ్వరా |
| సహము | I — — | కరుణాంభోధి |
| నవము | — | తెలుఁగుకవి |
| నలలము | I I | - సరసిజము |

## సూర్యేంద్ర చంద్రగణములు

వీనిలోఁ గొన్ని సూర్యగణము లనియుఁ గొన్ని యింద్ర గణము లనియుఁ గొన్ని చంద్రగణము లనియు బిలువఁబడును

సూర్యగణములు · నగణము హగణము.

ఇంద్రగణములు నలము, నగము సలము భగణము, రగణము తగణము

చంద్రగణములు : తగము, తలము భలము, భగురువు, మల వు, రలము రగము, నలలము, నగగము నవము, నహము, సలలము సవము, సహము.

### ౪. యతి

పద్యపాదమున మొదటి యక్షరమును యతి యందురు. దీనికే వళి, వడి, విరతి, విరామము మొదలైన పేర్లును గలవు. ఈ యీ పద్యముల కీయీ స్థానమున యతి యుండవలెనని ఛందశ్శాస్త్రము చెప్పును. ఆ విధముగా నా యా పద్యపాదముల మొదటి యక్షరమునకు సజాతీయమైన యక్షరము గూడ పాటింపవలెను.

యతిమైత్రిగల యక్షరములివి : వీనిలో నొకదాని కొకటి వాడుకొన వచ్చును.

౧ అ, ఆ, ఐ, ఔ, య, హ. ౨. ఇ, ఈ. ఋ, ౠ, ఎ, ఏ. ౩. ఉ, ఊ, ఒ, ఓ, ౪. క, ఖ, గ, ఘ. క్ష. ౫. చ, ౘ, ఛ, ౙ, జ, ఝ శ, ష, స, క్ష. ౬. ట, ఠ, డ, ఢ. ౭. త, థ, ద, ధ. ౮. ణ, న. ౯. ప, ఫ, బ, భ, వ. ౧౦. పు, ఫు, బు, భు, ము. ౧౧. ర, ఱ ౧౨. ర, ల. ౧౩. ల, ళ, డ. ౧౪. బిందుపూర్వక వర్గాక్షరములు-వాని పంచమాక్షరములు. ౧౫. ఙ, ఞ, ణ, న.

### ౫. ప్రాసము

పద్యపాద ద్వితీయాక్షర మ్రుప్రాసమనఁబడును. మొదటి పాదమున నే ప్రాసాక్షర ముండునో తక్కిన పాదములయందు నదియే యుండవలయును. ప్రాసస్థానమున వచ్చు హల్లులు (ద్విత్వములు–సంయుక్తములు కూడ) అన్ని పాదములలో నొక విధముగానే యుండవలెను. వానిమీఁది యచ్చులు వేరుగానున్న నుండవచ్చును. ప్రాసాక్షరమునకుఁ బూర్వము గురులఘువులలో నేదియున్న నన్ని పాదములలోను దానినే ప్రాసాక్షరమునకు ముందుంచవలెను. ప్రాసాక్షరము ద్విత్వము-సంయుక్తము-బిందుపూర్వకము నయినప్పుడు మాత్రము దానికిఁ బూర్వము లఘుగురువులలో నేది యున్నను దోషములేదు.

సూచన ఋ - ర ద - ధ - థ ణ - న
డ-శ ర-ల ఇవి ప్రాసములలో నొండొంటికిఁ జెల్లును ఇట్టివి మఱికి
యరుదు

## ౬. వృత్తములు, జాతులు, ఉపజాతులు

పద్యములు సాధారణముగా వృత్తములనియు జాతులనియు నుపజాతులనియు మూఁడు విధములు వృత్తములయందలి నాలుగు పాదములలోను అక్షరసంఖ్య గణక్రమము నొకటే విధముగా నుండును. జాతులు నుపజాతులు మాత్రాగణములతో నేర్పడునట్టివి వీనిలోఁ గొన్నింటికిఁ బ్రాస నియమము గలదు కొన్నింటికి లేదు.

## వృత్తములు

వృత్తములు పెక్కులు గలవు వీనిలోఁ గవులు దఱచుగా వాడునట్టి ప్రసిద్ధ వృత్తములివి. వృత్తము లన్నింటను బ్రాసనియమము గలదు.

౧ ఉత్పలమాల

గణములు

భ ర న భ భ ర లగము

కౌరవ పాండవుల్ తెఱగు గైకొని శాంతతఁ బొందియు న్కిమేల్

యతి ౧౦ వ యక్షరము

౨ చంపకమాల

న జ భ జ జ జ ర

తడయ క్రమొక్కి యున్నవి నతాసు తునపఘ దుచూచి యాత్మలో

యతి ౧౧ వ యక్షరము

౨. శార్దూలము :
మ స జ స త త గురువు

జ్ఞానానం ధమ్మయ స్వరూప క్షరదా। సద్వ్యక్త చింతామణీ
యతి . ౧౩ వ యక్షరము

౪. మత్తేభము .
స భ ర న మ య వ

చదువుల్ నేర్చిన దానికిన్ ఫలము నీచందం బుదాగాం చుడే
యతి ౧౪ వ యక్షరము

౫ మత్తకోకిల
ర స జ జ భ ర

శ్రీనివా సదయా నిధీని నుఁజేర కొల్తుమ ప్రేమరా
యతి ౧౧ వ యక్షరము

౬ మాలిని
న న మ య య

సరభ సజయ ఖాటీచం ధవైదం దకోటీ
యతి ౯ వ యక్షరము

సూచన . కొలఁది మార్పుతో నొక వృత్తమును మఱియొక వృత్తముగా మార్చ వచ్చును

౧ ఉత్పలమాలలో మొదటి గురువును రెండు లఘువులుగా మార్చిన నది చంపకమాల యగును
౨ శార్దూలములో మొదటి గురువును రెండు లఘువులుగా మార్చిన మత్తేభ మగును

## జా తు లు

కందము :

> కందము త్రి శర గణంబుల
> నందము గా భ జ స నలము లట వడి మూఁటన్
> బొందును న ల జ ల నాఱిట
> నొందుం దుద గురువు జగణ ముందదు బేసిన్

కంద పద్యమున మొదటి పాదమునకు మూఁడు గణములును రెండవ పాదమున కయిదుగణములు నుండవలెను అట్లే మూఁడవ పాదమునకు మూఁడు గణములును నాల్గవ పాదమున కయిదు గణములు నుండవలయును కందపద్యమును ఒకటి రెండు పాదములతో మొదటి ఖండముగాను మూఁడు నాల్గు పాదములతో రెండవ ఖండముగాను నెంచవలెను ఒక్కొక్క ఖండములో గ గ భ జ స నలము లను గణములలో నేవైన నెనిమిది గణము లుండవలెను ఆఱవ గణము నలముగాఁ గాని జగణముగాఁగాని యుండవలెను. బేసిగణముగా జగణముండరాదు ప్రతి ఖండాంతమున గుర్వక్షరము వచ్చునట్లు చూడవలెను రెండవ పాదమునను నాల్గవ పాదమునను నాలుగవ గణముయొక్క మొదటి యక్షరము యతిగా నుండవలెను ప్రాసనియమము నాలుగు పాదములకును గలదు

| నల | స | నల | | |
|---|---|---|---|---|
| అనుటయు | రసలిం | గమునిదు | | |
| స | స | జ | భ | స |
| తనవ | త్రువత్రేఁ | పసజ్ఞ | దంతపు | బరణిన్ |
| నల | నల | నల | | |
| నినిచిన | యొకపస | రిది యది | | |

| స | స | జ | భ | స |
|---|---|---|---|---|
| I I U | I I U | I U I | U I I | I I U |
| యనిచె | ప్పకపూ | సెఁదత్ప | దాంబుజ | యుగళిన్ |

౨. ఉత్సాహము :

ఏడు సూర్యగణములును, ఒక గురువును ప్రతి పాదమునకు నుండవలెను. ఐదవ గణము మొదటి యక్షరము యతి. ప్రాసనియమ మున్నది.

| గల | గల | గల | న | గల | గల | గల | గ |
|---|---|---|---|---|---|---|---|
| U I | U I | U I | I I I | U I | U I | U I | U |
| పూవుఁ | బోఁడిఁ | జూచు | నృపతి | పొల్చె | సంగుఁ | జూపు | లన్ |

## ఉపజాతులు

౧. గీత పద్యము ;

ఒక్కొక్క పాదమున మొదట నొక సూర్యగణము. పిమ్మట రెండింద్రగణములు, తరువాత రెండు సూర్యగణములు గలది గీత పద్యము. ప్రతి పాదమున నాల్గవ గణము మొదటి యక్షరమున యతి చెల్లును ప్రాసనియమము లేదు. ప్రాసయతి వాడిన వాడవచ్చును.

| గల | త | నగ | గల | గల |
|---|---|---|---|---|
| U I | U U I | I I I U | U I | U I |
| అమ్మ | హాశ్వంబు | ధవళదే | హంబు | నందు |

౨. ఆఁటవెలఁది

మొదటి పాదమునఁ దొలుత సూర్యగణములు మూఁడు, పిమ్మట నింద్రగణములు రెండు నుండును; రెండవ పాదమున నైదు సూర్యగణములుండును. తిరిగి మూడవ పాదమునకు మొదటిపాదము వలెను, నాలుగవ పాదమునకు రెండవ పాదము వలెను, గణములను గూర్చనగును. ప్రతిపాదమున నాలుగవ గణము మొదటి యక్షరమున యతి చెల్లును. ప్రాస నియమములేదు. ప్రాసయతి వాడవచ్చును.

| గల | గల | గల | త | నల |
|---|---|---|---|---|
| U I | U I | U I | U U I | I I I I |
| ఇట్లు | గాక | యుండ | నీ రెండు | దెఱఁగుల |

| గల | గల | న | న | గల |
|---|---|---|---|---|
| U I | U I | I I I | I I I | U I |
| వారిఁ | గాచి | కొనుము | వసుమ | తీశ |

౩. సీసపద్యము :

ఒక్కొక్క పాదమునకు వరుసగ నాఱింద్రగణములును, పిమ్మట రెండు సూర్యగణములు మొత్త మెనిమిది గణము లుండ వలెను. ఇట్టివి నాలుగు పాదములు చెప్పి పిమ్మట గీత పద్యము నైనను, ఆఁటవెలఁది నైనను జెప్పవలెను. దీనినే సీసపద్య మందురు. దీనిలోని మొదటి నాలుగు పాదములలోఁ బ్రతి పాదమున రెండేసి యతు లుండును. మొదటి గణమునఁ దొలియక్షరమునకును, మూఁడవ గణముతొలి యక్షరమునకును, యతిమైత్రి చూడవలెను. అట్లే యైదవగణము మొదటి యక్షరమునకును, ఏడవ గణము మొదటి యక్షరమునకును యతి చెల్లవలెను. దీనిలోఁ బ్రాస యతి వాడ వచ్చును. ప్రాస నియమము లేదు.

గమనిక : ఈ పాదమున మొదట నాఱు ఇంద్రగణములును, పిమ్మట రెండు సూర్యగణములును గుర్తింపుఁడు. దీనిలోఁ బ్రాస యతి వాడఁబడినది.

| నగ | సల | సల | నగ |
|---|---|---|---|
| I I I U | I I U I | I I U I | I I I U |
| నిడుదపె | న్నెఱిగుంపు | జడగట్టి | సగరుము |

| సల | నగ | న | గల |
|---|---|---|---|
| I I U I | I I I U | I I I | U I |
| మ్మనుమండు | తపము గై | కొనిన | చోటు |

౪. ద్విపద :

పదము లనగాఁ బాదములే. రెండు పాదములు గలది కనుక దీనికి ద్విపద యని పేరు వచ్చినది. ఇందుఁ బ్రతిపాదమునను మొదట మూఁడింద్ర గణములును, పిమ్మట నొక సూర్యగణము నుండును. మూఁడవ గణము మొదటి యక్షరమున యతి చెల్లును. ప్రాసనియమము గలదు. ప్రాసయతి వాడుటయు గలదు.

| ర | నల | త | న |
|---|---|---|---|
| U I U | I I I I | U U I | I I I |
| ఏమహా | త్మునిపురి | యీహేమ | నగర |

| త | సల | ర | న |
|---|---|---|---|
| U U I | I I U I | U I U | I I I |
| మేమెన్నఁ | దునుగాన | మిట్టిచి | త్రములు |

గమనిక : ప్రాస నియమము లేక ద్విపద పాదములను బెక్కింటిని జెప్పిన మంజరీ ద్విపద యందురు. పల్నాటి వీరచరిత మీ మంజరీ ద్విపదలోనే రచియింపఁబడినది.

---

# ౧౬. రచనా పద్ధతి

## ౧. పదములు — వాక్యములు

భావబోధనమున సమర్థములైన పదములనే ప్రయోగింపవలెను. రచయిత తాను ప్రయోగించు పదముల యర్థమును స్పష్టముగాఁ దెలిసికొని యుండవలెను, మాఱుమూల పదములను ప్రయోగింపఁ గూడదు. రచన సహజముగా నుండవలెను. అలఁతి యలఁతి వాక్యములు గల రచన యందముగా నుండును. సుదీర్ఘములైన వాక్యములను సాధ్యమైనంత వఱకు విడువ వలెను.

ఒక్కొక్క భాషకు నొక్కొక్క సంప్రదాయ ముండును. అట్టి సంప్రదాయమును బాటింపవలెను.

౧. 'నాచేత నన్నము తినఁబడినది.' యనుటకన్న 'నే నన్నము తింటిని'-అనుట లెస్స.

౨. 'ఎవరితో నిన్న నీవు మాట్లాడితివో యా రామయ్య వచ్చినాఁడు' అనుటకు మాఱు. 'నిన్న నీవు మాట్లాడిన రామయ్య వచ్చినాఁడు' అనుట తగును.

౩. 'అతఁడు చెప్పెను కదా నీవు రేపు బడికి రమ్మ' దీనికి బదులు 'నీవు రేపు బడికిరమ్మని యాతఁడు చెప్పెను' అన నగును.

౪. 'నేను పాఠ్య పుస్తకమును గలిగియుండలేదు' అనుటకంటె, "నాకు పాఠ్య పుస్తకము లేదు" అనుట సమంజసము.

౫. "రాముఁడు మఱియు లక్ష్మణుఁడు వచ్చిరి' దీనిని "రాముఁడును లక్ష్మణుఁడును వచ్చిరి" అని వ్రాయఁదగును.

౬. పెద్దలకు చిన్నలకు నమస్కారములు దీవెనలు చెప్పితిననుము' ఈ విధముగా వ్రాయరాదు. ఈ శైలి యొక యలంకారమే కాని సాధారణ రచనలలో బాగుండదు. "పెద్దలకు నమస్కారములు, చిన్నలకు దీవెనలును చెప్పితిననుము' అనుటయే బాగు.

## ౨. వ్యాకరణాంశములు

(అ) లక్షణ విరుద్ధమైన పదము ప్రయోగింపరాదు. దుస్సంధులు తగవు. తెలియనియెడల సంధి లేకుండఁగా వ్రాసినను ప్రమాద

ములేదు. సమాసములలో విసంధిగా వ్రాయఁగూడదు. సూర్య ఉదయము— కార్య ఉత్సాహము- ఈరీతిగా వ్రాయరాదు. వాక్యాంతమున సంధిలేదు.

(ఆ) 'ండు, ంబు, మ్ము' అనువాని నెక్కువగా ప్రయోగింపకుండుట మంచిది. రాముండు, వనంబు,జలమ్ముల వంటివి సాధారణ వచన రచనమున నంత బాగుండవు.

(ఇ) ఉత్తమ మధ్యమ ప్రథమ పురుషవాచక పదములు మూఁడును ప్రయోగింపఁబడినపుడు క్రియ యుత్తమ పురుషలోనే యుండ వలెను.

ఆనాఁడు నేను, నీవు, రామమూర్తి నాటకమును జూచితిమికదా!

(ఈ) మధ్యమ పురుష, ప్రథమ పురుషల ప్రయోగమున మధ్యమ పురుషను బట్టియే క్రియ వచ్చును.

నీవును రాముఁడును నిన్న వచ్చితిరి కాఁబోలు!
ఇట్లే:— రాముఁడును నేనును జదివితిమి.
మా బంధువులును నేనును యాత్రలు చేసితిమి.
మీరును నేనును గలిసి యీ పని పూర్తి చేయఁగలము.

(ఉ) పశుపక్ష్యాదులును, జడవాచకములును కర్తలై బహువచన మందున్నను భూత తద్ధర్మ ప్రథమ పురుషలయందు వాని క్రియలు మాత్ర మేకవచనమునందే యుండును.

ఆవులు మేసెను. ఆవులు మేయును.
కోళ్లు కూసెను. పంటలు పడెను.
నదులు సముద్రమునకుఁ జేరును.

## ౩. విరామాది చిహ్నములు

### (అ) పూర్ణ విరామము (ఫుల్‌స్టాప్)

వాక్యము పూర్తికాఁగానే సమాపక క్రియా పదమునకుఁ పూర్ణవిరామ చిహ్నముగా నొక చుక్కను (.) ఇట్లు పెట్టవలెను.

(ఆ) అర్ధ విరామము (కామా)

వాక్యము నడుమ వచ్చు నసమాపక క్రియాదులవలన వాక్యార్థము కొంచె మాగవలసివచ్చినపు డిట్టి (,) గుర్తును వ్రాయవలెను. దీనినే యర్ధవిరామ చిహ్న మందురు.

హనుమంతుఁడు సముద్రమును దాఁటి, లంకను జొచ్చి, యశోక వనమున సీతాదేవినిఁ గాంచెను.

(ఇ) ఆశ్చర్య సంతాపా ద్యర్థకము (ఎక్స్క్లమేషన్)

ఆశ్చర్యముగాని, సంతాపముగాని, సంతోషముగాని, సంబోధనముగాని వ్యక్తమగుపట్ల (!) అను చిహ్నమును వాడవలెను.

ఓహో! పరశురాముఁ డెంత పరాక్రమశాలి! రాజలోకము నంతటి నుఱ్ఱూఁత లూఁగించెనే!

(ఈ) ప్రశ్నార్థకము (ఇంటరాగేషన్)

ప్రశ్నవేయు సందర్భమున (?) అను గుర్తు వ్రాయఁదగును.
రామా! నీ వెప్పుడు వచ్చితివి? మీ కందఱికిని క్షేమమా?

(ఉ) కుండలీకరణము (బ్రాకెట్)

అంత ముఖ్యముగాని విషయమును దెలుపునపుడు(      )అను చిహ్నమును వాడవలెను.

శ్రీ వేంకటశాస్త్రిగారు (శతావధాని) నేఁ డుపన్యసింతురు.

(ఊ) ఉట్టంకనము (కొటేషన్)

ఒకరు చెప్పిన వాక్యము ననువదించు నప్పుడును, సామెతలను వాడునపుడును, ఒక గ్రంథస్థ వాక్యము నట్లే చెప్పవలసి వచ్చినపుడును నా వ్యాకాదుల కాద్యంతముల '   ' ఈ చిహ్నముల నుంతురు.

పంతులుగారు "రేపటికి మీరు లలితకళలపై నొక వ్యాసము వ్రాసి తెం" డని చెప్పినారు.

ఓహో! బాగుగా నున్నది. "వెదుకఁబోయిన తీర్థ మెదురైన యట్టు" మిమ్ముఁజూడ వచ్చుచుండఁగా మీరే వచ్చినారే!

'శరీరమాద్యం ఖలు ధర్మసాధన" మ్మని కదా మహాకవిసూక్తి!

(ఋ) అవాంతరవాక్య విరామము (సెమీకోలన్)

ఒక మహావాక్యములో వచ్చు నవాంతర వాక్యముల తుదిని (;) ఇట్టి గుర్తు పెట్టవలెను.

చూచితివా ! చెట్లు చిగిర్చినవి; మొగ్గ దొడిగినవి; మందమారుతము మలయుచున్నది; కోకిలల కుహూ నాదము వెల్లివిరిసినది; లోకమానంద మందిర మైనది; ఇది వసంత మహిమ.

గమనిక:- ఈ చిహ్నములలోఁ గొన్ని తొల్లి తెలుఁగులో లేవు. ఆంగ్లభాషా సంపర్కమున నేఁడు విరివిగా వాడఁబడుచున్నవి. పదములే యాయా విశేషార్థముల నిచ్చును. ఈ గుర్తులు వ్యంజకములు మాత్రమే.

(ౠ) రిక్తస్థలము (మార్జిన్)

లేఖ రచనమున లేఖకు పైభాగమునను, క్రింది భాగమునను గొంత వట్టిచోటు విడువవలెను. వ్యాసరచనమున నెడమవైపునఁగొంత స్థలమును విడువవలెను.

(ఌ) విషయ ఖండికలు (పేరాగ్రాఫ్-పేరా)

రచనమున పెక్కు విషయములఁ జెప్పవలసి వచ్చినపు డన్నింటిని కలిపి వ్రాసికొనిపోవుట తగదు. విషయములను ఖండములుగా విభాగించి, యొకటియైన పిమ్మట వేఱొకటి విశదముగా వ్రాయవలెను. అట్టియెడ నూతన ఖండము నంతకుమున్ను వ్రాసిన వాక్యముల వరుసలోఁ గాక కొంత కుడివైపునకు జరిపి ప్రారంభింపవలెను

## ౪. జాతీయములు - నుడికారము

### జాతీయములు

పాదుకొని యొక జాతివారి వాడుకలోనుండి విశిష్టార్థముల నిచ్చునట్టి వాక్యములే జాతీయములు. వీనిని సామెతలనియు, లోకోక్తులనియు, సూక్తులనియు, సుభాషితములనియు, నానుడులనియు వ్యవహరింతురు.

ఆడఁబోయిన తీర్థ మెదురైనయట్లు - వెతుకఁ బోయిన తీఁగె కాలికిఁ దగిలినట్లు - అను సామెతల వలన 'కార్యము సులభసాధ్యమైన'

దన్న విశేషార్థము వచ్చినది. ఇట్లే- 'ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కుదు నన్నట్టు' అనుట వలన 'స్వల్ప కార్యమే చేయలేనివాఁడు మహాకార్యము ఎట్లు సాధింపఁ గలఁడు ? సాధింపలేఁ'డను విశేషార్థము దోఁచుచున్నది

నుడికారము

మాట చమత్కారమే నుడికారము. పలుకుబడి యనియు దీనికే పేరు. ఇవి యెక్కువగాఁ బదరూపములో నుండును. జంటపదములు గానుఁ ఊఁత పదములుగాను పెక్కు విధములుగా నివి భాషలో వ్యాపించి యున్నవి. వీని ప్రయోగమునఁ బ్రకరణార్థ మెక్కువగా భాసించును.

కుడిభుజము, కన్నుల పండువు. అడవిఁ గాచిన వెన్నెల, మొదలైనవి పలుకుబళ్లు.

నారాయణభట్టు నన్నయభట్టునకు కుడిభుజము.

అనఁగా వ్యక్తికిఁ గుడిచేయి యెంత కార్యసాధకమో అంతగా సాహాయ్యము చేయువాఁడని భావము.

కన్నుల పండువు=మిక్కిలి యందమైనది; అడవిఁగాచిన వెన్నెల =వ్యర్థమైనది.

తోఁటలోఁ బువ్వులవలె భాషలో నీ జాతీయములు పలుకుబడులు విశిష్టమైన భావపరిమళమును వెదఁజల్లి భాషకొక క్రొత్త వన్నెను జేకూర్చును. జాతీయములు, నానుడులు లేనిభాష చప్ప చప్పఁగా, జీవము లేనట్లుగాఁ దోఁచును. కావున వీని తత్త్వమెఱిఁగి, యౌచిత్యమును బాటించి, యవసరమును గుర్తించి ప్రయోగించవలయును. విశాలమైన తెలుఁగుభాషలో నివి వేల సంఖ్యలో నున్నవి. మచ్చున కిటఁ గొన్ని చూపఁబడును. తక్కినవి వాడుకను బట్టియు, గ్రంథావలోకనము వలనను తెలిసికొనునది ఈ జాతీయములలోనుఁ పలుకుబడులలోను గొన్నిపద ములు వ్యాకరణ విరుద్ధములుగాఁ గనఁబడును. లోకవ్యవహారమునందున్న వానిని దిద్దుటకన్న వాని నట్లే ప్రయోగించుట మేలు.

## కొన్ని జాతీయములు

1. అందఱు అందలమెక్కితే మోసేవా రెవరు ?
2. అంగడిలో అన్నీ ఉన్నవి, అల్లుని నోటిలో శని ఉన్నది.
3. అడుసు త్రొక్కనేల ? కాలు కడుగనేల ?
4. ఆడుగులోనే హంసపాదా ?
5. ఇంటిదొంగను ఈశ్వరుఁడైనా పట్టలేఁడు.
6. ఇంట్లో తిని ఇంటివాసాలు లెక్కపెట్టినట్లు.
7. ఇల్లుచూచిన ఇల్లాలిని చూచినట్లే.
8. ఇంటిపేరు కస్తూరివారు. ఇంటిలో గబ్బిఁలాల వాసన.
9. ఉండమని చోటిస్తే ఊరంతా నాదే నన్నాడట.
10. ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గాని కెక్కెద నన్నదట.
11. ఊరికేపెట్టే అమ్మా నీ మగనితో సరిగాఁ పెట్టు మన్నాడట.
12. ఉన్నమాట అంటే ఊరు అచ్చిరాదుట.
13. ఎక్కడున్నావే గొంగడీ అంటే-వేసినచోటే ఉన్నానన్నదట.
14. ఎక్కడైనా బావగాని, వంగతోట దగ్గఱ కాదు.
15. ఏనుఁగు చచ్చినా బ్రతికినా వెయ్యి వరహాలు.
16. ఎంతచెట్టుకు - అంతగాలి.
17. ఐశ్వర్యం చికిలింత-అయ్యగర్వం కొండంత.
18. ఒళ్లు తెలియని సివ మెక్కినది.
19. ఒకరికి విందు - ఒకరికి మందు.
20. ఓసీ ఓసీ అంటే పోసీ పోసీ అంటారు జాగ్రత్త.
21. ఔనంటానికే ఆఱునెల్లా !
22. ఔషధం అమ్మమాట - అమృతం ఆలిమాట.
23. కఱ్ఱు ఆడితే కాటకము లేదు.
24. కాకిపిల్ల కాకికి ముద్దు.
25. కొండంత దేవునకు కొండంత పత్రి తేఁగలమా ?

26. కూటికి పేదైతే కులానికి పేదా ?
27. గ్రుడ్డిలో మెల్ల.
28. గోరుచుట్టుమీఁద రోఁకటిపోటు.
29. గూనివానికి గూని ఆలోచన-గ్రుడ్డివానికి గ్రుడ్డి ఆలోచన.
30. గోటితో పోవుదానికి గొడ్డళ్ళు కావలెనా ?
31. చాకిరి మావంతు-చల్ది మీ వంతునా ?
32. చావుదప్పి కన్ను లొట్టపోయింది.
33. చదువవేస్తే ఉన్నమతి పోయిందట !
34. చిత్తము శివునిమీఁద - భక్తి చెప్పులమీఁద.
35. డాబుచేయఁబోతే జేబు చిరిగిందట.
36. దూ దూ బసవన్నా అంటే తల వూపిందట.
37 తలప్రాణము తోకకు వచ్చినది.
38. తాటి నెక్కేవానిని తలదన్నే వాఁడుండును.
39. దరిద్రుని తల గడగఁబోతే వడగళ్ళ వానట.
40. దాసుని తప్పులు దండముతో సరి.
41. నమలేవాని కన్న మింగేవాఁడు ఘనుఁడు
42. నక్క ఎక్కడ - నాకలోక మెక్కడ ?
43. పట్టినదెల్ల బంగారము-ముట్టినదెల్ల ముత్యము.
44. పాడింది పాట - ఆడింది ఆట.
45. బాగాలు పెడితేఁ-రాగాలు తీయును.
46. బెల్ల మున్నంతసేపే చీమలు.
47. మంటిలో మాణిక్యం.
48. ముందు గొయ్యి - వెనుక నుయ్యి.
49. రోగి పాలే కోరె-వైద్యుడు పాలే యిచ్చె.
50. వ్రతము చెడినా ఫలము దక్కలేదు.
51. శంఖములో పోసినగాని తీర్థము కాదు.
52. సాగితే బండి - లేకపోతే మొండి.

## కొన్ని పలుకుబడులు

1. అల్లారుముద్దు, 2. అడుచు పాడుచు, 3. అదుపు అజ్ఞ, 4. ఆకునందక పోకను పొందక, 5. ఇసుక పాతఱ. 6. ఈఁడుజోడు, 7. ఇల్లు వాకిలి. 8. ఊరు పేరు, 9. ఉట్టికట్టుకొని ఊరేగుట, 10. ఏనుగు పాఁడి, 11, ఎంగిలి యుపవాసము, 12. ఒజ్జబంతి. 13. అందలమెక్కు, 14 కంకణముకట్టు, 15. కయ్యమునకు కాలుసాచు, 16. గందరగోళము 17 గంగిగోవు, 18, గుంటపూలుపూయు. 19. చచ్చిబ్రతుకుట, 20. చక్కనిచక్క. 21. చుక్కెదురు. 22. తలమునుకలు, 23 తామర తంపర, 24. తోఁకచిచ్చు, 25. 25. దొడ్డిగట్టిన గిడ్డి 26. దూరపు కొండలు నునుపు, 27. నామాలు పెట్టు, 28. నంగనాచి, 29. నేతిబీర, 30. పట్టగొమ్మ, 31. ప టపండు; 32. పిక్కబలముచూపు, 33. బక్క బడుగు, 34. బంగారు బొమ్మ. 35. బ్రాహ్మణ వ్యవసాయము 36 భల్లూకపు పట్టు, 37. మట్టిగడ్డలు, 38. మిన్నువిఱిగి పడు, 39. ముంగొంగు బసిడి, 40 రంగు బయటపడు. 41. రాగద్వేషాలు, 42. రామబాణము, 43. రట్టు-రవ్వ, 44. లాభము గూబలలోనికి వచ్చుట, 45. లక్కగుఱ్ఱము, 46. లాలిపాడు, 47 వంకలుదిద్దు. 48. వడ్డికాసులయ్య, 49. వెన్నతోఁబెట్టిన విద్య, 50. శరపరంపర, 51. శుష్క ప్రియాలు శూన్యహస్తాలు, 52. సందడిలో సడామిడి, 53. సగము సాలెనేఁత - సగము మాలనేఁత, 54 సింహస్వప్నము, 55 సిరిరా మోఁకాలొడ్డుట, 56. సిరిసంపదలు.

## కొన్ని యనుకరణ పదములు

1. కటకటలాడు, 2. గబగబ -డు, 3. చిరుబురుమను, 4. చర చర నడుచు, 5. బిలబిల పలుకు, 6 బొటబొట కాఱు, 7 టకటక లాడించు, 8. ట ఠాలు గుణించు, 9. ధమధమ మ్రోయు, 10. పఱపఱ

గోయు, 11. వటవట లాడించు, 12. బడబడ వాగు, 13. భగభగమండు 14 మలమల మాడు, 15. ముసి ముసి నవ్వు, 16. లుకలుక లాడు, 17. రుస రుస మను, 18. రెపరెప లాడు, 19. వడవడ వడఁకు, 20. విసవిస లాడు, 21. సలసల క్రాగు, 22. సురసుర పొంగు.

## ౫. లేఖ రచన

వచన రచనలలో లేఖరచన యొక విశిష్టస్థానము నాక్రమించినది. ప్రముఖుల లేఖలు వాఙ్మయములో నొక భాగమే యైనవి. వివేకానంద లేఖలు, మహాత్ముని లేఖావళి, జవహర్లాలు తన కొమరితకు వ్రాసిన లేఖ మాల, శారదలేఖలు సుప్రసి ద్ధైనవి.

లేఖల రచన చదువువానికి సంతోషము గలిగింపఁ జాలినదియై యుండవలెను నిష్ఠురములు, ఎత్తిపొడుపులు, ద్వంద్వార్థములు తోఁచు నట్లు పదప్రయోగము చేయరాదు లేఖను మొదలిడుట. ముగించుట ఒక్కొక్క ప్రాంతమున నొక్కొక్క విధముగా నుండవచ్చును. అట్టి సంప్రదాయమును పాటించుట యవసరము అక్షరములు సరిగాఁ బొంక ముగా నుండవలెను. తుడుపులు, కొట్టివేఁతలు రానీయఁగూడదు. స్పష్ట మైన భాషలోఁ జెప్పఁదలఁచిన విషయమును క్లుప్తముగా వ్రాయనేర్వవలెను.

విషయమునుబట్టి లేఖలు ఐదు విధములు :

౧. వ్యక్తిపరమైన లేఖలు. ౨. వ్యాపారసంబంధమైన లేఖలు, ౩. ఉద్యోగములకుఁ జెందిన లేఖలు, ౪. అభ్యర్థన లేఖలు, ౫. సాంఘిక మైన లేఖలు.

### (౧) వ్యక్తిపరమైన లేఖ

స్నేహితులు, బంధువులు మొదలైనవారు పరస్పరము వ్రాసికొను నవి వ్యక్తిపరమైన లేఖలు. వీనిలో క్షేమవార్తలు, సొంతవిషయములు నుండును. విద్యార్థివిహారములలోఁ దాము గాంచిన విశేషములను బాలురు

తమ తలిదండ్రులకో, గురువులకో వర్ణించి వ్రాయునట్టి లేఖలును వ్యక్తి పరము లైనవే. ఈ లేఖలన్నియు వార్తాప్రధానములు ౨. వర్ణనాత్మకములుగా నుండవచ్చును..

## (౨) వ్యాపార లేఖ

ఇందు వ్యాపార విషయములుండును వస్తువులు పంపుమని వ్రాయుట, ధరలను కనుగొనుట మొదలైన సంగతులు వ్రాయఁబడును. ఇవి చాల సంగ్రహముగా నుండఁదగును. వ్యాపారముచేయువారు పని తొందరలో నుందురు. పెద్ద లేఖలను జదువు సమయము వారి కుండదు. కనుక కావలసిన సంగతులే వ్రాయవలెను.

## (౩ )ఉద్యోగ సంబంధ లేఖ

ఉద్యోగు లొకరి కొకరు వ్రాసికొను లేఖ లివి. వీనిలో వారి వారి యుద్యోగమునకు సంబంధించిన విషయములే యుండును. సొంత గొడవ లేమాత్రము వీనిలో రారాదు. ఉద్యోగి తారతమ్యమునుబట్టి గౌరవపద ప్రయోగమించుక మాఱుచుండును.

## (౪) అభ్యర్థన లేఖ

ఒక కార్యాలయములో నుద్యోగము కొఱకు వ్రాసికొనునట్టిది యభ్యర్థన లేఖ. ఉద్యోగముచేయు నొకఁ డంతకన్న పై శ్రేణిలోనికిఁ దన్నుఁ దీసికొనఁగోరుచు వ్రాసికొనునట్టిదియు, ఒకఁడు తనకు జరిగిన యన్యాయమును దీర్చుమని యున్నతాధికారికిఁ బెట్టుకొన్న మొఱయు నీ వర్గములోనే చేరును. బడి పెట్టింపుఁడనియో, బావి త్రవ్వింపుడనియో గ్రామ ప్రజలు పలువురు గలిసి ప్రభుత్వాధికారులకు వ్రాసికొను మనవి కూడ అభ్యర్థన లేఖయే.

## (౫) సాంఘిక లేఖ

సాముదాయకముగా సంఘమువారి కందఱికిని సంబంధించిన విషయములు గలది సాంఘికలేఖ. పత్రికాధిపతులకు నాయా విషయములను దెలుపుచు వ్రాయు జాబులును, పత్రికాముఖమున బ్రకటించు బహిరంగ

లేఖలు నిట్టివి. పీడోక్కలు పత్రములు, స్వాగతపత్రములవంటివి యీ తెగలోనికి వచ్చును. ఇవి యందఱికిని జెందువిషయములు.

ఒక లేఖలో ముఖ్యముగా నివి యుండును :

౧. లేఖ శిరమున ఎడమవైపున వ్రాయువానిపేరు, అధికారాదులతోఁ గూడిన విలాసమును, కుడివైపున నగర గ్రామాదులును, నాఁటి తేదియు నుండును.

౨. ఎవరికి లేఖ వ్రాయఁబడుచున్నదో వారి ఆశ్రమ వయోదశలను బట్టి శ్రీ-శ్రీమతి-శ్రీమాన్-బ్రహ్మశ్రీ-మహారాజశ్రీ మొదలైనవియు నుండును.

౩. అటుపిమ్మట లేఖలో వ్రాయఁదలఁచిన ముఖ్యవిషయములు.

౪. గౌరవము, ప్రశంస, వినయము తెలియఁజేయు ముగింపు పదము : చిత్తగించవలెను, గ్రహింపవలెను, విధేయుఁడు మొ.

౫. చేవ్రాలు, ఇది చాల ముఖ్యము. వ్రాలే ప్రాణము చీటికి-అన్నారు.

౬. జాబు చేరవలసిన వారి విలాసము: దీనిని చిఱునామ అనియు నందురు. దీనికి వేఱుగా చోటున్నది. విలాస మీవరుసలో నుండవలెను

పేరు-ఉద్యోగము - (నగరమైనచో గృహసంఖ్య-పేట) ఊరు - పోష్టు-తాలూకా-జిల్లా,

## ౬. వ్యా స ర చ న

వ్యాసరచన విద్యార్థికి మిక్కిలి యవసరము ఉత్తమ గ్రంథరచనమున కిది యభ్యాసరంగమువంటిది. హృదయములోని భావమును [illegible]ర్తించుట కుపన్యాసము లెట్టివో వ్యాసములు నట్టివి. ఉపన్యాసములలోని భావములకంటె వ్యాసముల ద్వారమునఁ బడినవి స్థిరముగా నుండి యెక్కువ మేలు గూర్చును. ఒకవిషయమునే దృక్పథభేదముతో భిన్న భిన్న వ్యాసములుగా వ్రాయవచ్చును.

వ్యాసములు మూలముగా నాలుగు విధములు : ౧. వర్ణనాత్మకములు, ౨. కథనాత్మకములు, ౩. భావనాత్మకములు, ౪. వాదాత్మకములు.

## ౧. వర్ణనాత్మకములు

పక్షులు, మృగములు మొదలైనవాని స్వరూప స్వభావములు, ఆహార, విహారములు లోనగు విషయములను వర్ణించి చెప్పెడి వ్యాసము లివి. అజంత, ఎల్లోరా, తాజ్‌మహల్, సహస్ర స్తంభదేవాలయము, ప్రాచీన దుర్గములు, ఉన్నతన్యాయస్థానములు, విశ్వవిద్యాలయములు, మొదలైన వానిని వర్ణించుచు వ్రాయు వ్యాసము లిందుఁ జేరును. సూర్యోదయము, సూర్యాస్తమయము, వసంతరాగము, గాలివాన, పర్వతశ్రేణులు నదులు, జలపాతములు, సముద్రము, అడవులు మున్నైన ప్రకృతిదృశ్యముల వర్ణించు నట్టివియు వర్ణనాత్మక వ్యాసములే. ఇట్టి వ్యాసములను వ్రాయునతఁ డాయా మృగములను, పక్షులను, దృశ్యములను, ప్రదేశములను స్వయముగఁ జూచియుండినఁ జక్కగా వ్రాయఁగలుగును.

## ౨. కథనాత్మకము

జరిగిన సంగతులను పూసగ్రుచ్చినట్లు చెప్పుటయే కథనము. పలనాఁటి వీరచరిత్ర, బొబ్బిలి యుద్ధము, సైనిక విప్లవము, రాజపుత్ర వీరచరిత్ర, మహారాష్ట్ర విజయములు, స్వాతంత్ర్య సమరగాథ మొదలైన వానిపై వ్రాయు వ్యాసములు కథనాత్మకము లనఁదగును. అశోకుఁడు, అక్బరు, విక్రమార్కుఁడు, హర్షచక్రవర్తి, రాజరాజు, నన్నయ తిక్కనాదులు, లోకమాన్యుఁడు, మహాత్ముఁడు, లోనగు వ్యక్తుల జీవితగాథలును, పెండ్లి పేరంటములు, పండుగ పబ్బములు, జాతరలు మొదలైన వానిపై వ్రాసినవియు నిట్టి కథనాత్మక వ్యాసములే.

ఈ తెఱఁగు వ్యాసములు వ్రాయవలెనన్న లేఖకుఁడు చరిత్రలు బాగుగాఁ జదివియుండవలెను. అయా సంఘటనలు జరిగిన ప్రదేశ

ములు, అందుకు హేతువులు, అందుఁ బాల్గొన్న ముఖ్య వ్యక్తులు. తేదీలు ఖుణ్ణముగా గుర్తుపెట్టుకొని యుండవలయును, జీవిత చరిత్రలు వ్రాయునపు డా వ్యక్తి యెందుకు ప్రసిద్ధుఁ డాయెనో వ్రాయవలెను, ముఖ్య ఘట్టములను తెలుపవలెను.

## ౩. భా వ నా త్మ క ము

ఊహించి వ్రాయునట్టిది భావనాత్మక వ్యాసము. 'నేనే నియంత నైనచో' 'రూపాయి ఆత్మకథ' 'పూవుల భాష' 'కలలో లోకయాత్ర' 'కత్తి × కలము సంవాదము' 'పేదవాని గుండెలలో' 'మృగముల మహాసభ' మొదలయిన శీర్షికలమీఁద వ్రాయునట్టివి భావనాత్మకములు, ఇందలి విషయములు సాక్షాత్తుగా దాను చూచునట్టివియా కావు: గ్రంథములలోఁ జదివినట్టివియా కావు; ఇఁకఁ గేవలము భావించి భావించి వ్రాయవలసినవి ఇందుకు లోఁతైన భావన యవసరము.

## ౪. వా దా త్మ క ము

ఇదియా? అదియా? యని యొక విషయముపై చర్చసాగించి వ్రాయు వ్యాసము వాదాత్మక వ్యాసము. ఇరుపక్షములలోని సాధకబాధకములను పరిశీలించి, మంచిచెడ్డలను జల్లెడపట్టి. ఒకదానిలోని విశేషములకు నిరూపించి యది మేలని నిర్ణయించవలెను. 'విద్యయా? ధనమా? ఏది నిజమైన సంపద!' 'కవియా? యోధుఁడా? ఎవరు దేశమున కెక్కువ యవసరము?' 'దేశము బాగుపడుటకు మద్యపాన నిషేధమును దొలగించవలెనా?' 'పల్లెటూరి జీవికమా? పట్టణవాసమా? ఏది సుఖతరము?' ఆస్తికుఁడా? నాస్తికుడా? ఎవరు విజ్ఞాని?' 'మిత్రమా? బంధువా? ఎవరెక్కువ విశ్వాసపాత్రులు?' 'రాజకీయ స్వాతంత్ర్యమా. ఆర్థిక స్వాతంత్ర్యమా దేశమునకు ముఖ్యము?' 'ఐక్యరాజ్య సమితి యవసరమా, అనవసరమా?' - ఇట్టివి వాదాత్మక వ్యాసములు.

తక్కిన యనేక విషయములను నీ నాల్గు విభాగములలో వేనిలో ననుకూలముగ నుండునో దానిలోఁ జేర్చవలయును.

సంగ్రహముగా వ్యాసాంశములు

ఏనుఁగును గుఱించి వ్యాసము వ్రాయవలె ననుకొనుఁడు. సంగ్రహముగా ముందీవిషయములను వ్రాసికొనవలెను.

౧. సాధారణాకారము. ౨. అది ఎక్కడ నివసించును? అదియే జాతికిఁ జెందినది? ౩. దాని యాహారము, విహారము. ౪. దానివలని యుపయోగములు, ౫. వాఙ్మయములోఁగాని సంఘములోఁగాని దాని స్థానము.

ఈ యంశముల నొక్కొక్క దానిని విస్తరింపఁజేయుచు వ్రాసిన వ్యాసము చక్కఁగాఁ బూర్తియగును.

ఒక మహావ్యక్తి యైనచో ౧. తలిదండ్రులు. అతని పుట్టుక అభిజనము, ౨. అతని బాల్యము, ౩. విద్యార్జనము, ౪. గృహస్థజీవితము -ఉద్యోగాదులు, ౫. జీవితమున మార్పు, ౬. చేసిన ఘనకార్యము, ౭. ఉపదేశము-ఇట్లు శీర్షికల నేర్పఱచుకొని వ్యాసము పూర్తిచేయవలెను.

పండుగయైన యెడల: ౧. అది యెప్పుడు వచ్చును, ౨. దానికిఁ బురాణగాథ యేమి? ౩. ఆనాఁ డేమి గావింతురు? ౪. సమాజములో ఈ పండుగవలనఁ గలిగిన వికాస మెట్టిది? ౫. పూర్వులీపండుగల నెందు కేర్పఱచి యుందురు? మొదలగు శీర్షికలను పెట్టుకొనఁదగును. కొన్ని ముఖ్యములైన పండుగలను గుఱించి 'హిందువుల పండుగలు' వంటి పుస్తకములను జదివియు. గురువుల నడిగియుఁ దెలిసికొని యుండవలెను అభ్యాస వశమున వ్యాసరచనమున నందెవేసినచేయి యనిపించుకొనవచ్చును.

'తేజస్వినా వధీత మస్తు.'



ANDHRA LAKSHNA RATNAKARAM
(A Detailed Telugu General Grammar)

## ఇతర కృతులు

### ముద్రితములు

1. ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణము (అలంకారము) రు. 18-00
2. హాలికుడు (నాటకము) 3-00
3. సోమనాద్రి విజయము (వీరగాథ) 1-50
4 ముకుందమాల (సంస్కృతాంధ్రములు) 1-50
5. అలంకార వసంతము (అలంకారము) 3-00

### అముద్రితములు

1. ఆంధ్రౌచిత్య విచార చర్చ
2. కాళిదాస కావ్యోద్యానము
3. భారతీయ వ్యాకరణేతిహాసము

*Copies can be had from ;*

**1. Srinivasa Book Sellers & Stationers,**
1-9-1122/10/B, O. U. Road,
Vidyanagar-Hyderabad-500 044.

**2. Madhavi Book Centre**
Opp. Arya Samaj Mandir,
Sultan Bazar - Hyderabad - 500 027.